# వెన్నెలతో మానవుడు

( కథలు )

"శివం"

నవోదయ పబ్లిషర్స్,
విజయవాడ-2.

# కృతజ్ఞత

ఈకథలను తమ పత్రికలలో ప్రచురించి నన్ను ప్రోత్స హించిన ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, జ్యోతి, అభిసారిక, ప్రజామత, విశాలాంధ్ర, చిత్రాంగి పత్రికా సంపాదకులకు, నేడు పుస్తక రూపాన తెచ్చిన

నవోదయ పబ్లిషర్స్‌కు నా కృతజ్ఞత.

**రచయిత.**

# ఇందులో


| | | |
|---|---|---|
| వెన్నెలలో మానవుడు | '57 సం॥ | రచన |
| పరిష్కారం | '53 | ,, |
| కళాకారులు | '55 | ,, |
| స్మృతిలోని స్మృతులు | '50 | ,, |
| కాంతి | '51 | ,, |
| అడవి | '52 | ,, |
| సరిపడని సత్యం | '52 | ,, |
| స్వయంకృతం | '54 | ,, |
| సరిగమలు | '51 | ,, |
| తీరనికోరిక | '48 | ,, |
| ముఖారి | '49 | ,, |
| సౌందర్యోపాసకుడు | '50 | ,, |
| ప్రకటన | '52 | ,, |

# వెన్నెలలో మానవుడు

రైలుబండి అంతా కిక్కిరిసివుంది. బండి వడిగా వెడుతూన్నా బండిలో కూర్చున్న రామారావుకు గాలి ఏమాత్రమూ ఆడటంలేదు. దీనికితోడు చుట్టూ కూర్చునివున్న జనము రైలుపెట్టెను వుమ్ములతోను, నారింజతొక్కలతోను, చుట్టల పొగతోను నానా గలీజు చేసివేస్తున్నారు.

రైలు కుదుపుకుదిపి కూతకూసి ఏలూరువైపు బయలుదేరిన తర్వాత పెట్టెలోని తనచుట్టూవున్న ప్రయాణీకులందరినీ పరిశీలనగా చూచి రామారావు నిట్టూర్చేడు. తోటి ప్రయాణీకులమీద చెప్పరాని అసహ్యం కలిగింది అతనికి. ఏమిటి? వీళ్ళంతా మానవులేనా? ఎందుకు యిలా ప్రవర్తిస్తారు వీళ్ళు? పశువుల్లా, ఏమిటీ హడావిడి, గందరగోళం, గలీజు....!

ముస్తాబాద స్టేషనులో బండి ఆగింది. రామారావు ఆలోచనలు ఒక్కక్షణం ఆగిపోయాయి. హఠాత్తుగా తమపెట్టెలోకి ఎక్కుతూన్న ఆజానుబాహువుమీద అతని దృష్టి వాలింది. మనిషి అంత ఒడ్డూ, పొడుగూ వున్నా ఏదో నిస్సహాయుడిలా అవుపించసాగేడతను. పెదవుల చివర ఏవో విషాదరేఖలు! ఆ వ్యక్తి తూలుకుంటూ రామారావు కూర్చున్నచోటుకు వచ్చి సామానులపెట్టె బల్లను పట్టుకుని నిలబడ్డాడు. గుప్పుమని ముక్కుపగిలేట్లు సారావాసన పెట్టె అంతా వ్యాపించింది. రామారావు అతన్ని అసహ్యంతో చూచి, పక్కక్షణం ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు— తనీవేళ ఎందుకు బయలుదేరేనా అని తనని తానే తిట్టుకుంటూ.

బండి బయలుదేరక పోయిందేం? మరొక్క ఐదు నిమిషాలు ఆలస్యం అయివుంటే పరేషయ్యేదో? ఒంటిగంట అవొస్తోంది. బళ్ళ

నవ్వుకుని కాఫీకి యింటికి వెళ్ళబోతూండగా పోస్టుమేన్ కార్డుముక్కను ఆఫీసుబల్లపైకి విసిరేడు.

ఉత్తరం తీసుకుని తను మెట్లుదిగి క్రిందకి వచ్చి, సిగరెట్టు వెలిగించుకుని ఉత్తరాన్ని చదివేడు 'బావకు ఏలూరు హాస్పిటలులో ఆపరేషను చేసేరని, పరిస్థితి ఆందోళనకరంగా వుందిగనుక, నువ్వు వెంటనే బయలుదేరి రావాలని' జాబు.

క్రింద సంతకమైనా లేదు. వంకరటింకర అక్షరాలు బహుశా చిన చెల్లెలే రాసి సంతకం మర్చిపోయి వుండవచ్చును.

కార్డును జేబులో పెట్టుకుని ఇంటికి హడావిడిగా పరుగెత్తేడు తను. బండికి సరిగా ఇంకా గంటమాత్రమే 'టైం' వుంది. భార్యకి ఉత్తరం చూపేడు తను. ఆమె మరీ బేజారయిపోయింది. గబగబా కాఫీ యిచ్చి, "వెళ్ళిరండి. పాపం, వాళ్ళక్కడ యేం ఖంగారుపడుతున్నారో" అని తనని తొందరచేసింది. ఎందుకో వచ్చిన 12 రూపాయలు జేబులో వేసుకొని హడావిడిగా తనొచ్చి ఈ రైలులో పడ్డాడు. మెయిలులో అయితే ఇంత అవస్థ వుండకపోవచ్చునేమో, కాని 'టైం' ఏదీ? ఆ కార్డు చూసేక మొట్టమొదటి ఈ రైలుకి బయలుదేరక చేసేదేముంది?

పెట్టెలో నిలబడివున్న ఆజానుబాహువు, నవ్వుతూ గొణుగుతూనే అకస్మికంగా పక్కమనిషిమీదికి వొరిగి, పెట్టెలో పడిపోయేడు. రామారావు ఆ మనిషిపడటం గమనించినా కదలలేకపోయేడు పట్టుకోడానికి. ఎదురుంగావున్న గ్యాంగ్‌మనిషి ఒకతను పడిపోతున్న మనిషిని మధ్యలోనే పట్టుకుని, తొడమీద కూర్చోపెట్టుకుని 'మంచినీళ్ళ'ని అరిచేడు.

ఎవరివద్దవుంటాయి మంచినీళ్ళు, అనుకున్నాడు రామారావు కొంచెం చికాకుపడుతూ ముడుచుకుకూర్చుని. పెట్టెలోవున్న వృద్ధురాలు ఒకామె కోడలితో అంది: "మన మరచెంబులో ఏమైనా వున్నాయేమో చూడమ్మా.... మనం కావలిస్తే మళ్ళీ పక్కస్టేషన్లో పట్టుకోవచ్చు."

గోడలు లేచి మరచెంబు మూతతీసి, మరచెంబును 'గ్యాంగ్ మేన్'కు అందిచ్చింది. అతను గ్లాసులో కాసిని నీళ్ళుపోసి, ఆ నీళ్ళు పడిపోయిన వ్యక్తి ముఖంమీద చిలకరించేడు. రెండు నిమిషాలకు ఆ వ్యక్తి కదిలి, కళ్ళు తెరచి, కృతజ్ఞతతో 'గాంగ్‌మాన్' వైపు తిరిగి చూచేసి లేచి కూర్చున్నాడు. మాట్లాడకుండానే ఓ గ్లాసుడు నీళ్ళు త్రాగి లేచి నిలబడ్డాడు. ఎందుకో రామారావు ఇస్త్రీ బట్టలవైపు, ప్లైక్సీ 'మా' వైపు ఓసారి తీక్షంగా చూచి ముఖం తిప్పేసుకున్నాడు. ప్రక్క స్టేషన్లో బండి ఆగగనే త్వరితంగా దిగి వెళ్ళిపోయేడు.

బండి తిరిగి కదిలింది. బండిలోని జనం యథాప్రకారం మాట్లాడు కోవడం, పుస్మడం. గొణగడం, నిద్రపోవడము సాగించేరు.

రామారావు ఆలోచనలో పడ్డాడు. తనకి చాలా గొప్పగొప్ప ఆలో చనలున్నాయి. మానవత్వంతో తిరిగి ఈ ప్రపంచాన్ని పునర్నించ వచ్చుని తను గట్టిగా నమ్ముతాడు, కాని ఈ అజ్ఞానంలోపడిన మానవుల్ని తను ప్రేమించలేకపోతున్నాడు.

రామారావు భరించలేక, ఆలోచనల్నితోసేసి కిటికీలోనుంచి బయ టకు చూడసాగేడు.

ఏలూరులో బండి ఆగింది. రామారావు లేచి బండి దిగుతూం డగా పెట్టెలోనివాళ్ళంతా నిందాపూర్వకంగా తననేవేలెత్తిచూపి నవ్వు తూన్నట్లనిపించింది. తననుచూచే ఏదో గుసగుసలాడుకుంటున్నట్లు అని పించింది. వాళ్ళ చూపులు తన శరీరాన్ని దహించివేస్తున్నట్లు అయి పోగా, త్వరితంగా బయటపడి రిక్షా ఎక్కి గోపాలంగారి హాస్పటలుకు వెళ్ళేడు రామారావు, దడదడలాడే గుండెలతో హాస్పటలు ఆవరణలో అతను కాలుపెట్టేసరికి అయిదుంబావయ్యింది.

కుడివైపు హాలువలె వుంది. హాలుముందు ఏ దెనిమిది కుర్చీ లున్నాయి. ఎవరో ఒకరిద్దరు కూర్చుని వున్నారు వాటిలో - బహుశా మందులకోసం ఎదురుచూస్తూ, హాలు ప్రక్కనే 'ఆస్టిన్'కారు ఒకటి నిల

బడి వుంది. ఆ కారుముందు వంగి కూర్చుని ఒక వ్యక్తి ఏదో పరిశీల నగా చూస్తూ వున్నాడు. రామారావు ఆత్రుతతో కుడివైపున ఎడంగా వున్న గదులవైపు చూచేడు. ఎవరో ముగ్గురు స్త్రీలు అటుయిటూ హడా వడిగా తిరుగుతూన్నారు. రోగులవార్డు కాబోలును అది. అయితే ఆ చుట్టుప్రక్కల తన చెల్లెలుగాని, తల్లిగాని తమ్ముడుగాని ఎక్కడా అవు పించరేమిటి? గదులలోపలకు దృష్టి సారిస్తూ యీ మూలనుండి ఆమూ లకు నడిచేడురామారావు. తన బావగాని, ఆఖరికి తనకి పరిచయస్థులు గాని ఎవ్వరూ కన్పించలేదు. బహుశా యీసరికి అంతా అయిపోయి వుంటుందా? తనవాళ్ళంతా యింటికిపోయి ఏడుస్తూ కూచున్నారా? ఇంత నీచాలోచన వచ్చినందుకు తనను తాను నిందించుకుని, మరోసారి లోపలకు దృష్టిని సారించి వరండాలో నడవసాగేడు రామారావు. బహుశా తన బావకు స్వస్థత చిక్కడంవలన యింటికి వెళ్ళిపోవచ్చు నన్నారేమో? తనుతిన్నగా ముందు యింటికివెళ్ళి వుండవలసిందేమో?.... కాని వాళ్ళు ఉత్తరంలో తన నిక్కడకే రమ్మని రాసేరే!

రామారావుకు ఏమిచెయ్యాలో తోచిందికాదు. ఇంకా ఎక్కడైనా గదులున్నాయేమోనని చుట్టూ చూచేడతను ఎడమవైపున మేడమీద చిన్న హాలు వుంది. బహుశా అది 'ఆపరేషను థియేటరు' అయి వుండాలి. అయినా డాక్టరుగార్నే తను స్వయంగా ఒకసారి కలుసు కుంటే- రామారావు హాలులోనికి వచ్చి ఆగంతకులలోని ఒక వృద్ధుని అడిగేడు, "డాక్టరుగారు వున్నారా?" అని.

'ఆస్తమా' రోగిలావున్న ఆవృద్ధుడు, దగ్గి, "వారే డాక్టరుగారు" అని, యింకా కారును పరిశీలిస్తున్న వ్యక్తినిచూపేడు.

రామారావు కారువద్దకువచ్చి ఆగేడు. డాక్టరులేచి, చేతులు దులుపుకుంటూ "ఇప్పుడేవస్తాను" అంటూ హాలువెనక వున్న గదిలోప లకు వెళ్ళి, రెండుక్షణాలలో తడిచేతులు తుడుచుకుంటూ తిరిగివచ్చి, "లోపలకు రండి" అన్నాడు. డాక్టరువెనకే రామారావు "కన్సల్టింగ్ రూం"లోకి దారితీసేడు.

ఖాళీగా వున్న కుర్చీలో కూర్చుని, రామారావు అన్నాడు "క్షమించండి. చిన్న 'యిన్ఫర్మేషన్' కావలసి వచ్చేను."

"ఓ, యస్" అన్నాడు, డాక్టరు

"మా బాబుకు ఆపరేషను చేసేరని వుత్తరం వచ్చింది. అందులో గోపాలంగారి హాస్పిటలు అనికూడా వ్రాసేరు. కాని వార్డ్సంతా రెండుసార్లు వెతికినా మా బాబుజాడ కన్పించలేదు. అతను ఎక్కడున్నాడో దయచేసి చెబుతారా"

"ఏం ఆపరేషను అది?"

"తెలియదు. నాకొచ్చిన ఉత్తరంలో వివరాలేమీ లేవు."

"యస్, ఎప్పుడు జరిగింది ఆపరేషను?"

"మొన్న ఎనిమిదో తేదీన."

"యస్. ఒక్కనిమిషం వుండండి" డాక్టరు లేచి అలమారులోని రిజిష్టరు పట్టి తెచ్చి, "అవును 8 వ తేదీని ఒకే ఒక ఆపరేషను చేశాం. 4 వ నెంబరు గదిలోను చూడండి" అన్నాడు.

"నేను చూసేను సార్, అక్కడ లేడే!"

"ఏమిటి మీ పేరనేది? అసలు 'పేషంటే' అక్కడ లేడంటారా?"

"ఉన్నాడు సార్. కాని మా బాబు లేడు."

డాక్టరు ఒకసారి రామారావును ఎగాదిగా చూచి, మళ్లా రిజిష్టర్ తెరిచి చూసి, "మీ బాబు పేరు ఏమిటన్నారు? పి. రంగారావు, అదేకదూ?

"కాదండి. నారాయణరావు స్వస్థలం బందరు."

"అయితే యీయన యింకొకరు, వీరిది గుడివాడ."

రిజిష్టరు మూసేసి, కండ్లజోడును తుడుచుకుంటూ బల్లవద్దకు వచ్చి నిలబడ్డాడు డాక్టరు. రామారావు లేచి నిలబడి, "అయితే 8వ తేదీన గాని, ఆపైనగాని నారాయణరావు అనే వ్యక్తికి మీహాస్పిటల్లో ఆపరేషను జరగలేదన్న మాట." అన్నాడు.

"లేదు' ఇదే మొదటిసారికూడా నేనా పేరు వినడము."

"క్షమించండి. శ్రమ యిచ్చేను."

రామారావు గదిదాటి, మందుసీసాల వాసనలోనుంచి యివతల పడ్డాడు. చల్లటిగాలిలో ఎక్కడికోపోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయ్యింది. వాయుపారవశ్యం తీరకముందే, మరి "యిప్పుడేం చెయ్యాలి" అనే ప్రశ్న వుదయించింది ఏం చెయ్యాలి? ఎవరుమాత్రం యీ పరిస్థితిలో ఏంచేస్తారు? తిన్నగా చిన్న బజారులోని యింటికి వెళ్ళిపోవడమే వుత్తమం అని నిశ్చయించుకున్నాడు రామారావు.

ఇంటికి బయలుదేరబోతూండగా రామారావుకు మరో ఆలోచన కల్గింది. మరోసారి నాలుగవనంబరు గదిని చూచి, అక్కడున్న రోగి తన బావ కాడని నిర్ధారణచేసుకుంటే వచ్చిన నష్టమేమిటి? అవును. అట్లాగేచెయ్యాలి అనుకుంటూ రామారావు, రోగుల వార్డువైపు తిరిగేడు మళ్ళీ.

గుమ్మంలో ఎవరో వృద్ధవితంతువు కూర్చునివుండటం గమనించి, రామారావు నాలుగోనంబరు గదిముందే ఆగిపోయేడు. ఎవరీవిడ? తన తల్లి ఎవరినైనా సాయం తెచ్చుకోలేదుగదా? తనుమాత్రం యీవిడను యిదివరకెన్నడూ చూచివుండలేదు వెనక్కి వెళ్ళడమా ముందుకు నడవడమా అని అతను ఆలోచిస్తూండగా, ఆమె రామారావును చూచి, "ఎవరుకావాలి నాయనా" అని ప్రశ్నించింది. ఎండకు అరచేతిని అడ్డు పెట్టుకుని.

"ఈ గదిలో వుండేది రంగారావుగారేనా అండి?"

"అవును నాయనా. నీ పేరు?" లేచి నిలబడిందామె.

"రామారావండి. మాది బెజవాడ."

"రా బావా....లోపలకు రా...." హీనస్వరంతో ఎవరో కేకవేసేరు లోపల్నుండి.

తన బావేనా ? ఈవిడెవరు మరి ?

రామారావును వెల్లబోయి చూస్తూ, ఓ ప్రక్కకు తప్పుకున్నది వృద్ధురాలు. రామారావు లోపలకు జొరబడ్డాడు.

మంచముమీద పడుకునివున్నాడు గూడకట్టుతో—రోగి !

గోడవైపు ముఖం పెట్టుకుని పడున్న అతను. అల్లాగేవుండి, చెయ్యి వూపేడు కుర్చీలో కూర్చోమన్నట్లు. సంజ్ఞతో. రామారావు స్తబ్ధుడయి నిలబడిపోయేడు అట్లాగే. రోగి నీరసంగా మూలుగుతూ. ప్రక్కకు తిరిగి తలెత్తి రామారావును చూచి, విస్తుపోయి తల దించేసేడు—నిట్టూరుస్తూ.

రోగికి అవతలప్రక్క కూర్చుని విసురుతూన్న యువతి నిల్చుని, చేతిలోని విసనకర్రతో బొమ్మవలె నిలబడిపోయింది.

రోగి కళ్లు మూసుకుని, చెయ్యివూపుతూ "కూర్చోండి" అన్నాడు హీనస్వరంతో.

ఎంత పొరపడ్డాడు తను ? తన బావకాడితను.

కుర్చీలో కూర్చుని రామారావు గొణిగేడు "ఏదో పొరబాటు జరిగింద....మా బావ అనుకున్నా."

రోగి కళ్లుతెరచి, మలినహాసంతో అడిగేడు, "సీతేమయినా వ్రాసిందా ?" రామారావు తల వూపేడు. వృద్ధురాలు ప్రక్కగదిలో నుంచి మంచినీళ్ళు తెచ్చిచ్చి, "వాడి బావకోసం చూస్తున్నాం నాయనా. అలికిడయితే చాలు బావ వస్తున్నాడనుకుంటాడు వాడు" అన్నది.

రామారావు నవ్వి, గ్లాసును క్రిందపెట్టేసేడు. చిన్న మూలుగుతో రోగి మళ్ళీ కళ్ళుతెరచి, "క్షమించండి, మా బావ అనుకున్నాను" అన్నాడు.

"నేనూ మా బావను వెతుక్కుంటూ తిరుగుతున్నాను. గోపాలంగారి హాస్పటలు యిదేనా, మరేదైనా వుందా ?" అన్నాడు రామారావు.

"యిదే నాయనా ఇదే" అన్నది వృద్ధురాలు. రోగి ఏదో బాధతో, దీనంగా తనవంకే చూస్తున్నాడు. అతనిభార్య కావల్ను - మహాఓర్పుతో విసురుతూనే వుంది.

ఒక్కక్షణము నిశ్శబ్దం అలముకున్నది బాధాకరమైననిశ్శబ్దములో రోగి వుండుండి సన్నగా మూలగసాగేడు. రామారావు మూలుగును విననట్లు గట్టిగా అన్నాడు, మళ్ళీ: "మా బావకు యీ హాస్పటలులోనే ఆపరేషను జరిగిందట. హాస్పటలు అంతా వెదికేను. ఎక్కడా కన్పించలేదు. ఉత్తరంలో మాత్రము యీ హాస్పటలు అనే వ్రాసేడు." రామారావు చెయ్యి లాగుజేబులోని వుత్తరాన్ని స్పృశిస్తోనేవుంది .... వుత్తరాన్ని చూపాలా వద్దా అని అతను మనస్సు ఆలోచిస్తూందగా.

"అయ్యో....పాపం" అన్నది వృద్ధురాలు.

"మీ బావ పేరు?" అడిగేడు రోగి.

"నారాయణరావు! బందరు" చెప్పేడు రామారావు.

"ఆ మొదటిగదిలో ఆయన—ఏమిటే అమ్మా ఆయన పేరు?" అన్నది వృద్ధురాలు కోడలితో.

"వారా .... రాజన్నగారు .... వారిది బందరు ఏమిటండి. నూజివీడు."

"బావ రాత్రిబండికే వస్తాడు వుత్తరం చూచుకొని" అన్నాడు రోగి పైకప్పులోకి చూస్తూ.

"ఆ....మీ బాధ రావల్సిందే....వెతపడుతున్నారు.అవి ప్రాణాలతోటే గాని పోవు...." అన్నది వృద్ధురాలు.

"లేదమ్మా....చూస్తూంటు. రాత్రికి వచ్చేస్తాడు" బాధగా అన్నాడు రోగి.

రామారావును ఏంచెయ్యాలో తోచక ప్రశ్నలు ముసురుకుంటూండగా ముసలామె అన్నది...."నీ పేరేమిటన్నావు బాబూ."

"రామారావండి."

రోగి నెమ్మదిగా చెప్పేడు. "మా బావపేరూ రామారావే; సుందర రామారావు? అంచుకే మిమ్మల్ని లోపలికి రమ్మన్నానిందాక."

"రామారావు మనస్సు రెపరెపలాడింది. ఆత్రుతను అగుపించ నీయకుండా అడిగేడు "ఏంపని చేస్తాడు మీ బావ ?"

"డి. ఇ. ఓ.-ఆఫీసులో గుమాస్తా "

"ఏవూరు?" తను రోగిని బాధపెడ్తున్నాడు. కాని తప్పదు.

"బెజవాడ" నిదానంగా తనవైపే చూస్తూ మూలిగేడు రోగి బాధగా.

రామారావుకు సగం భారం తగ్గినట్లయ్యింది. ఎంత పొరపాటు చేసేడు పోస్టుమ్యాన్ ! చిన్న నిట్టూర్పుతో తన జేబులోని కార్డును బయటకు లాగి, "యీ వుత్తరం మీరు వ్రాసినదే కదూ ?" అడిగేడు.

రంగారావు వుత్తరంవంక చూచి మూలిగి....

"మా ఆవిడ రాసింది .... అనుకున్నంతా అయ్యిందన్నమాట" అన్నాడు.

"ఏం .... ఏమయ్యింది ?" అన్నది వృద్ధురాలు. జరిగినదేమిటో అర్థంకాక.

"అంత లక్షణంగా రాసింది, అది ఎడ్రెస్సు ! పొడిఅక్షరాలు రాసింది." అన్నాడు రంగారావు.

"అంతేకాదు. డి. ఇ. ఆఫీసు అన్నది డి ఇ. ఓ., ఆఫీసు అనే బదులు. !"

నేను డిస్ట్రిక్టు ఇంజినీరు ఆఫీసులో పనిచేస్తున్నాను."

రంగారావు పుత్తరాన్ని వెనకా ముందూ చూచి, నిట్టూర్చి, భార్య వైపు పడనేసి "క్షమించ సంతకం అయినా చేసుకోరూ?" అన్నాడు.

2]

"మనస్సు బాగుండక మరచిపోయినట్లున్నా" అన్నది ఆమె ముఖం చిన్నబుచ్చుకొని.

వృద్ధురాలు విషయమంతా యిప్పుడు గ్రహించినట్లు, "అయితే నువ్వు నిన్న రాసిన జాబు కూడ అన్నకు చేరలేదన్నమాట"

"ఏమ్మా అందులేంది? పాపం.. మధ్య యీ మనిషి కూడిలిపోయి వరుసగా కొచ్చేరు" అన్నాడు రోగి విచారంగా.

"అయ్యో నాయనా .. ఎంత ఇంగాగుపడ్డావో ఏమిటో .... ఆపద అన్నాక ఎవరికైనా ఎరికలేకనా" అన్నది ఓత్తుపోయి

"బావ రాక ప్రమాదం" గొణుగుతున్నాడు రోగి. రామారావుకు రోగిమీద జాలివేసింది. మగదిక్కు లేకుండా, వక్కడూ యీ ఆడ వాళ్ళతో ఎంత అవస్థపడుతున్నాడు!

వృద్ధురాలు క్షణంక్రింద అన్న మాటలు మళ్ళీ గుర్తుకొచ్చినాయి అతనికి. "ఆపద అన్నాక ఎవరికైనా ఇతకేగదా" రామారావు చేతి గడియారం చూసుకొని "ఆలస్యం అవుతోంది" అన్నాడు, టపా వుంటుందో వుండదో అనే సందేహంతో.

రోగి నొచ్చుకుంటూ "మిమ్మల్ని శ్రమపెట్టే...." అన్నాడు.

అబ్బే....మరేం ఫర్వాలేదు ... యిక్కడకు రావడంవలన మా దావ కులాసాగా వుండలేకూడా నిశ్చయంగా తెల్సింది, చూడండి" అన్నాడు.

"మళ్ళీ శ్రమ ఇస్తున్నాను అనుకోకపోతే వుంటే మీరిక్కడా స్టేషనుకు వెళ్ళేప్పుడు....మా బావకో వుత్తరం వ్రాసి పడెయ్యండి"

"వుత్తరమూ, మశానమూను! వాళ్ళెందుకు వస్తార్రా .... వూరికే డబ్బుదండగ" తల్లి అన్నది రుసరుసలాడుతూ.

రోగి భార్యముఖం చిన్నబుచ్చుకోడం గమనించెడతను.

"నాకు రేపల్లా సెలవుంది .... మీకొంచెం నయంగా వున్నాకే వెడతా. వుత్తరమో, టెలిగ్రామో కావల్సివుంటే పంపిస్తానులెండి!" రోగి నుదురును స్పృశిస్తూ. నుదురు కాలుతూన్నట్లు వేడిగావుంది.

"నాకు నెంపాదిగానే వుంది మీరు నాకోసం శ్రమ...."

"అబ్బే మరేం లేదు.... నేను పోస్టాఫీసుకు వెళ్లొస్తా."

రామారావు రిక్షా ఎక్కి తిన్నగా పోస్టాఫీసు కెళ్ళేడు. అనుకున్నట్టే పోస్టాఫీసు తెరిచివుంది సుందరరామారావుకి 'బ్రదర్-ఇన్-లా-సిక్-స్టార్టు' అని టెలిగ్రాం కొట్టి మళ్ళీ రిక్షా ఎక్కేడు. దారిలో భోజనంచేసి నాలుగు బత్తాయిపళ్ళు కొనుక్కొని అతను తిరిగి హాస్పటలు చేరేసరికి ఎనిమిదయ్యింది.

గుమ్మంలో కూర్చుని విసురుకుంటూన్న వృద్ధురాలు రామారావు చేతిలోని బత్తాయిలను చూచి "యిదంతా ఏమిటినాయనా" అంది నొచ్చుకుంటూ.

"ఫర్వాలే. ఉంచండి" అని గుమ్మంలో వుంచేడు. వృద్ధురాలు ఆరుబయట వేసిన మంచంమీద రామారావు కూర్చొని "ఎట్లా వుందాతనికి" అన్నాడు

వృద్ధురాలు ఆ ప్రక్కనే చాపొకటి వేసుకొని కూర్చొని "ఇప్పుడే నిద్ర పట్టింది నాయనా. ఒళ్ళుమాత్రం అలాగే వేడిగా వుంది. నిన్న మధ్యాహ్నం చేసిన గాభరాకి యివ్వేళ కనక నీ ధైర్యం లేకపోతే ఏమయిపోయేవాళ్ళమో! నువ్వు వెళ్ళేక డాక్టరొచ్చి చూసేడు. ఇవ్వేళ గడిస్తే మరేం భయం లేదన్నాడు. నువ్విక్కడ వుండటం మాకు కొండంత ఆసరాగా వుంది!"

"మరేం ఫర్వాలేదు.... అదే తగ్గిపోతుంది. నాదేముంది.... కాస్త మాటసాయం అంతే" అన్నాడు.

అట్లా అనకు బాబూ! ఇంతమంది బంధువులుండి ఏం ప్రయోజనం.... సమయానికి ఒక్కళ్ళూ లేకపోయేక. వాళ్ళబావ వున్నాడే. వాడంతా అదోరకం మనిషిలే! ఉత్తరం రాసినాగాని అతను వస్తాడని నాకు నమ్మకం లేదమ్మా.... మనస్సులో వుండాలిగాని పైనుంచి యెక్కడనుండి వస్తుంది నాయనా ఆప్యాయతా, ప్రేమా!

రామారావు తలవూపి వూరుకున్నాడు.

"పెళ్ళికట్నంతాలూకు వో వెయ్యి యివ్వాల్సి వున్నారు వాళ్ళింకా. పెళ్ళినాడే గోళ్ళూడగొట్టి పుచ్చుకోలేకపోయేం వెర్రిబాగులవాళ్ళం కినక! ఆపరేషను అవసరంకదా అని వో రెండువందలయినా పంపమని ఆ మధ్య రాయించేను. అదీకోపం వాళ్ళకి!"

రామారావుకు ఏమనాలో తోచక "వూహూ!" అన్నాడు.

"ఒక్కటి చెపుతాను విను నాయనా! మనుషుల్లో స్వార్థం హెచ్చిపోయింది. ఇరుగు పొరుగు, మంచీ చెడ్డా, న్యాయాన్యాయాలు నశించిపోయేయి. అందుకే యీ యుద్ధాలు, కరవులూ, రొటకాలూను. దాన్ని తగలెయ్యా.... డబ్బు పంపించకపోతే పోనీ ... శాస్త్ర పచ్చి చూసిపోకూడదూ?.... ఆపరేషను చేయించుకుంటాడని తెలిసికూడా ...."

"అయితే ఆపరేషనుకు ముందుగా రాసేరన్నమాట!"

"రాసేడు. వాడేరాసేడు గుడివాడనుంచి. ఇప్పుడు నువ్వు మాకు ఏమంత బంధువని యిట్లా గిలగిలలాడిపోతున్నావు. మనుషులమై పుట్టేక అంతా వకటే! నాకొచ్చిన కష్టమే, నీకొచ్చిన కష్టంలాంటిది.... కాస్సేపు ఆట్లా నడుంవాల్చు నాయనా.... వంటిల్లు మాచుకుపెస్తా.... అదొక్క_ర్తేవుంది పాపం...."

రామారావుకు ఎప్పుడుపట్టిందో నిద్రపట్టింది. ఆకస్మికంగా ఏవో కేకలు విని పులిక్కిపడి లేచేడతను. కిటికీలోనుంచి లైటు పెద్దదిగా వెలుగుతూండటం గమనించేడు రామారావు. రోగికాబోలు అరుస్తున్నాడు బిగ్గరగా! "ఒస్తాడమ్మా....' వస్తాడంటూంటే! నాకేం ఫర్వాలేదు."

రామారావు లేచి లోపలకు వెళ్ళేడు. ముసలామె మంచంమీద కూర్చుని వణికిపోతూన్న రోగిని గట్టిగా పట్టుకునివుంది. కోడలు లాంతరును ఎత్తిపట్టుకుని దీనంగా భర్తను చూస్తూ నిలబడివుంది. రామారావునుచూచి వృద్ధురాలు అన్నది, "బాగా జ్వరంతగిలింది. పడికిపోతున్నాడు. ముందుగదిలో వుందేమో, నర్సుని ఓసారి పిలుస్తారా?"

రోగి ఏదో వినపడీ వినపడకుండా మాట్లాడేస్తున్నాడు అట్లాగే. రామారావుకు వెంటనే అనుమానం వేసింది— 'డెలీరియం' ఏమోనని. నర్సు ఏం చేస్తుంది?

"డాక్టరు ఎక్కడమ్మా వుండేది!", గడియారం చూచుకుంటూ అడిగేడు రామారావు 1-10 నిమిషాలు.

"చీకట్లో వెళ్ళగలవా నాయనా? ఆ ఎదురుగా అపుపించే మేడ ప్రక్కనువున్న పచ్చడాబా."

"ఇప్పుడే వెళ్ళి వస్తాను." రామారావు డాక్టర్ యింటికి పరుగెత్తాడు.

అర్ధరాత్రి అనుకోకుండా డాక్టరువచ్చి చూశారు ఇంజక్షను యిచ్చి, 'మరేం ఫర్వాలేదు ఉదయానికి పూర్తిగా తగ్గిపోతుంది! అని ధైర్యం చెప్పి వెళ్లిపోయేడు. రోగికి మరో అరగంటకల్లా వళ్లు తెలియని నిద్ర పట్టేసింది

ఉదయాన్నే రోగి రామారావును నవ్వుతూ పలకరించేడు. కాఫీ త్రాగేరా అని అడిగాడు. తను చేసిన ఉద్యోగం గురించి చెప్పేడు. ఆప్తబంధువులా సాయంత్రం వరకు కష్టసుఖాలు అనేకం చెప్పుకున్నారిద్దరూ!

సాయంత్రం డాక్టరువచ్చి రోగినిచూచి, చిర్నవ్వు వదలి వెళ్ళిపోయేడు నర్సువచ్చి మందిచ్చిపోయింది. రోగి బావమాత్రం రాలేదు.

ఆరవుతూండగా రామారావు స్టేషనుకు వెళ్ళడానికి లేచేడు.

రోగి అన్నాడు, "వెళ్ళిపోతున్నారా? మీ మేలు...."

"అవును. రేపు అఫీసు వకటి వుందిగా." "మీకు నేనెంతో శ్రమ యిచ్చాను" వృద్ధురాలు అన్నది.

"ఫర్వాలేదు దానికేం."

"గుడివాడ వస్తే మా యింట్లో దిగాలి." రోగి భార్య అన్నది.

"అట్లాగేనమ్మా! మరి వస్తా. వంట్లో కులాసచిక్కాక ఓ వుత్తరం వ్రాయించండి....ఎడ్రెసు తెలుసా—"

అంతా నవ్వేరు ఒక్కసారి. నవ్వుల వెన్నెలమధ్య రామారావు స్టేషనుకు నడిచేడు.

రైలంతా జనంతో కిటకిటలాడిపోతోంది. కిటికీవద్ద కూచునివున్న రామారావు కిటికీలోనుంచి బయటకు చూసేడు ఎటుచూచినా పండు వెన్నెల. పెట్టెలోని జనంవైపు చూచేడు. స్థలంకోసం తగవులాడుకుంటు న్నారు నడుస్తున్న రైల్లోని జనం; బయటకు చూచేడు మళ్ళా. ఆహ్లాద కరమైన వెన్నెల. విచారాలను మరపింపజేసే వెన్నెల. బండీలో తన చుట్టూ చూచేడు మళ్ళీ. పసిపిల్లలకన్నా హీనంగా ప్రవర్తిస్తూన్న ప్రజలు.

విశాల ప్రపంచాన్ని ఆవరిస్తున్న వెన్నెలవంకే చూస్తూన్న అతని మనస్సు ఎంతో ప్రేమతోను, ఆనందంతోనూ నిండిపోయింది. ఎన్నడూ ఎరుగని తృప్తి అతని హృదయాన్ని ఆవరించుకుంది. ఇంతకు ముందు యీ ప్రజల్ని చూచి అసహ్యించుకున్నది తనేనా అని ఆశ్చర్య పడసాగేడు రామారావు.

# పరిష్కారం

సీతారామయ్య ముఖం ఆనందంతో చాటంతయ్యింది। తన ముఖంలోని భావాలను మరెవ్వరూ గమనించటంలేదుకదా అని ఆఫీసు నలువైపులా చూశాడతను. లేదు, ఎవరిపనిలోవారు తీవ్రంగా నిమగ్నులై వున్నారు.

సీతారామయ్య చేతిలోవున్న కార్డులోని ముఖ్య విషయాన్ని చదువుకున్నాడు. "సాయంత్రం ఎక్స్‌ప్రెస్సులో అక్కయ్యను పంపిస్తున్నాం. తప్పక స్టేషనుకు రావలసింది." తన బావమరిదిచేత వ్రాయించేరు. మామగారికి అంత తీరుబడికూడా లేదుకాబోల్ను।

ఉత్తరాన్ని డ్రాయరులోపడవేసి, బల్లమీది ఫైలును దగ్గరగాలాగుకొని చేతికొచ్చిన కాగితం తెరిచేడతను, అతనిదృష్టి ఆ కాగితంలోని అక్షరాల్ని పరిశీలించడం లేదు. అతని మనస్సు సాయంత్రం వచ్చే అతని భార్యనిగురించి ఆలోచిస్తూన్నది.

క్రొత్తగా రెక్కలొచ్చిన పక్షిలా గిలగిలలాడుతూ ఎగరబోయింది అతని మనస్సు వియత్పథానికి. కాని చాలా సామాన్యమైన విషయాల చుట్టే అతని మనస్సు విహరించసాగింది.

'హం। హోటలుపీడ విరగడయిపోయింది. చస్తూన్నాను - రెండు నెలలనుంచీ। రోజూ సొరకాయకూరే....। రేపొద్దున్నే బజారెళ్ళి హాయిగా బంగాళదుంపలు, టమేటోలు, వంకాయలు తీసుకొచ్చి పడెయ్యాలి.'

'చన్నీళ్ళబాధ విరగడయిపోయిందికద। తలంటుకొని నెలదినాల వస్తూంది. తను రేపుప్రొద్దున్నే లేవగానే ముందు తన భార్యచేత తలం

టించుకోవాలతను. మాడంతా దిమ్మగా, పోటుగా వుంటూంది యీమధ్య మరీ !'

'తనూ శాంత కలసి సినిమాకి వెళ్ళి దాదాపు రెండేళ్ళు అవ స్తూంది. రెండేళ్ళు ! తనీమధ్య....అది పూర్వెళ్లేముందుకూడా ఏదో ఒకందుకు చిరాకుపడుతూ తనకి తీరుబడివుండదని చెప్పి తప్పించు కుంటూ వచ్చేడు, పాపం ! అవతల వాటాలో ఆడవాళ్ళతో కలిసి ఎప్పు డైనా వెళ్లేది, రేపోఎల్లుండో సినిమాకు తీసుకెళ్లాలి !"

'దొరగారు పిలుస్తున్నారు సార్ !' అన్నాడు జవాన్ వచ్చి.

ఆలోచనల్లోంచి యివతల పడి "వస్తూన్నా" అంటూలేచి కాలరు సర్దుకొని ఆఫీసరుగదిలోకి నడిచేడు సీతారామయ్య.

అయిదు నిమిషాల తర్వాత సీతారామయ్య ఆఫీసరు గదిలోంచి దిగులు ముఖంతో యివతలపడ్డాడు. అయిదుంబావుసరకు భార్యసంగతి మళ్ళీ గుర్తురాలేదతనికిక !

స్టేటుమెంట్సు పూర్తిచేసేసి, సంతకాలు చేయించి, డిస్పాచ్‌లో యిచ్చేసి, డ్రాయరు తాళంవేస్తూండగా మళ్ళీ గుర్తొచ్చింది అతనికి భార్య విషయం ! హడావుడిగా వెంటనే స్టేషనుకు పరుగెత్తేదతను.

సీతారామయ్య అనుకున్నట్లు అతనికా దినంతో హోటలుపీడ వదిలిపోయింది. హాయిగా కావలసినరకరకాల కూరలు చేయించుకుని తింటున్నాడు. బుద్ధి పుట్టినప్పుడు తలంటుస్నానం చేస్తున్నాడు. ఇష్టమై నప్పుడు భార్యను సినిమాకి కూడా తీసుకువెళ్తున్నాడు (ఒక్కసారే). కాని ఎక్కడో ఇందులో లోటు అవుపించసాగింది అతనికి. తనూహిం చిన, ఆశించిన జీవితం కాదిది. ఇందులో క్రొత్తేమీ లేదు తనభార్య రెండు నెలలక్రితం పుట్టింటికి వెళ్ళకముందుకూడా ఇట్లాగే గడిచిపోయేది తన జీవితం. ఇందులో తనకి శాంతిలేదు. తను చిరాగ్గా పూర్వం లాగానే మళ్ళీ అయినదానికి, కానిదానికి చికాకుపడుతున్నాడు. తన భార్య తన నుడికించడానికన్నట్లు ప్రతీవిషయంలోను ప్రవర్తిస్తూన్నది. గత

దినం జరిగిన సంఘటననిగురించి ఆలోచిస్తే అతనికినవ్వాలో, ఏడవాలో తెలియటంలేదు....

ఆఫీసునుంచి యింటికి వచ్చేసరికి తన భార్య చక్కగా ముస్తాబయివున్నది. 'ఏమిటోకధ' అనుకుంటూనే గుమ్మంలో అడుగుపెట్టేడతను. 'ఏమండీ ఇవ్వేళ చాలా మంచిసినిమా వచ్చిందటండీ రాక్సీలోకి.'' అన్నది. ఇంకా మూడు దినాలైతే కాని జీతాలురావు!

తనదగ్గిర చిల్లరఖర్చుకని వుంచుకున్నదానిలో రూపాయిమాత్రం మిగిలివుంది. మాట్లాడకుండా లోపలికెళ్ళేసరికి ప్రక్కవాటాలోని ఆఖరు పిల్లకాబోల్ను, చెవులు చిల్లులు పడేట్లు ఏడుస్తూంది. చికాకు కనబడ నీయకుండా, కోటును విప్పి చిలకకొయ్యకి తగిలించి బాత్‌రూంలోనికి వెళ్ళేడు. తను ముఖం కడుక్కోడానికి.

తిరిగి మధ్య గదిలోకి వచ్చేసరికి గుక్కపెట్టి ఇంకా ఏడుస్తూనే వుంది. ప్రక్కవాటా వాళ్ళ పిల్ల. 'ఆతల్లి ఏమిచేస్తోంది సముదాయించ దేం?'' అనుకుంటూ, ముఖం తుడుచుకోసాగేడు.

శాంత వచ్చి ఎదురుగా, దగ్గరగా నిలబడింది చిర్నవ్వుతో. శాంతముఖం చూచేడతను అసహ్యంగా. దట్టంగా పౌడరు పులుము కొనివుంది శాంత. తను ఎక్కడ వద్దంటాడో అని, అన్నివిధాల ఆయుధాలు ప్రయోగించడానికి సిద్ధమయి వున్నట్లు చిర్నవ్వు తెచ్చి పెట్టుకున్నది. 'నటన! అంతా నటన!' అనుకున్నాడతను

నిశ్శబ్దాన్ని భరించలేనట్లు 'ఏమండీ?' అంది మళ్ళీ శాంత.

తల్లినీ, తండ్రినీ సోదర్ని వదలుకొని పెండ్లి అనే బంధంతో మరోమనిషి దాసిన అయిపోతుందికదా ఆడది! తనిప్పుడు వద్దంటే.... దమ్మిడీ అంత ముఖమయిపోతుంది, ఉపయోగించేదా ఆయుధం....

ప్రక్కవాటాలో తాత్కాలికంగా ఆగిన ఆక్రందన తిరిగ ప్రారంభ మయ్యింది సీతారామయ్యవంటిమీద తేళ్ళు జెర్రులూ ప్రాకుతున్నట్లుంది.

'ఏ పద్దేమయినా డబ్బులుంటే బయద్దేను' అన్నాడతను దుస్తులు వేసుకుంటూ.

"మొన్న మీరిచ్చినవాటిల్లో ఇంకా రెండురూపాయలున్నాయిగా నాదగ్గిర" అన్నది.

'బ్రతికేం! రూపాయి అనా....' అనుకుంటూ "బయలుదేరుమరి" అన్నాడు.

ట్రాం దిగి హాలువద్దకు నడుస్తుండగా ఒక కిళ్లీకొట్టుదగ్గిర ఎవరో పగలబడి నవ్వసాగరు. సీతారామయ్య వాళ్ళవైపు చూచేడు. ఒకాతను తన భార్యవైపుచూసి నవ్వుతున్నాడు. మిగతావాళ్ళు తమవైపే ఎక్కడికో చూస్తూన్నట్టు నటిస్తున్నారు సీతారామయ్యకు భార్య పౌడర్ పూసుకున్నవిధం గుర్తుకొచ్చింది. 'ఛీ' అనుకుంటూ భార్యకు ఇరవై గజాలముందర నడవసాగేడతను. "అబ్బ! అంత వేగంగా పరుగెడితే....ఎట్లాగండీ! ఏమండోయి...." సీతారామయ్య పళ్ళు బిగించి భార్యపక్కనే నడవసాగాడు.

సీతారామయ్య సినిమాల్లో కూర్చున్నాడేగాని ఏంచేసేది అతనికే తెలియలేదు అతను కొన్ని ముఖ్య విషయాలను గురించి ఆలోచిస్తూ ఒక విషయం తెల్చుకున్నాడు. తన భార్యకి తనపై ఆకర్షణ చాలనీ, తను చేతిలోనుంచి జారిపోకుండా గట్టిగా పట్టుకోవాలని ప్రయత్నిస్తోందని—గ్రహించేడతను. అందుకే ఆ దట్టమైన పౌడరుపూత, వెకిలి చిర్నవ్వులూను. అయితే దీనికి కారణమేమిటో కనుక్కునే వ్యవధిని ఆమె సీతారామయ్యకి ఇవ్వలేదు. "ఏమండీ? రోడ్డుమీద కారంత వేగంగా తోలితే మనుషులు చావరూ! చచ్చేనాడు, అట్లా తోలిస్తాడేం కారువాడు" అనీ, ఆ అమ్మాయిని ఎందుకంత అట్లా కసురుతాడాయన అనవసరంగా' అని, 'ఆ హెయిర్‌స్టైలు బావుందండీ' అనీ ఆటంకపరుస్తూన్నంతసేపూ అతని ఆలోచనల్ని చెదరగొట్టసాగింది. సీతారామయ్య ఏమీ మాట్లాడలేదు పళ్ళుమాత్రం బిగపట్టుకొని ఎప్పుడు సినిమా అయిపోతుందా అని ఎదురుచూడసాగాడు. సినిమా అయిపోయాక, తనకి రెక్కలుంటే ఎంత బాగుండివుండేది అనికూడా అనుకున్నాడు అతను ఇంటికొస్తూ.

అప్పుడు జీవితం దినదినానికి దుర్భరమయిపోతూంది. దీనికి కారణమేమిటో కనుక్కోవాలి. వీలుంటే పరిష్కరించాలి. ఇట్లాగైతే తనెన్నాళ్ళో వుండలేడీ సంసారంలో.

సీతారామయ్య యింట్లో అడుగుపెట్టేసరికి గదంతా గడబిడగా వుంది. ఎవరెవరో పిల్లలు, తన పుస్తకాలతో ఆట్లాడుతున్నారు అడ వాళ్ళు తన గదిలో కూర్చుని తలలు దువ్వుకుంటున్నారు.

వంటింట్లోకి వచ్చిన సీతారామయ్యతో శాంత అన్నది చిర్నవ్వుతో "మా పెద్దనాన్న కూతుళ్లు, పిల్లలూ తిరపతి వెళ్తూ దిగారు."

సీతారామయ్య కోటైనా విప్పకుండానే బయటకు నడిచేడు మళ్ళీ.

ప్రక్కవాటాలోని వాళ్ళ కుక్క తోకఆడిస్తూ సీతారామయ్య మీదికి ఎగరబోయింది. నరాలు వికిగేట్టు ఒక్క తన్ను తన్ని పార్కు వైపు వెళ్ళిపోయాడతను.

*　　　*　　　*

సీతారామయ్య మర్నాడు ఆఫీసునుంచి ఇంటికొచ్చేసరికి ఇల్లంతా ప్రశాంతంగా హాయిగావుంది. వచ్చిన బంధువులు వెళ్ళిపోయేరేమో అనుకున్నాడతను ముందు, కోటును చిలకకొయ్యకి తగిలించి 'శాంతా' అంటూ పక్కగదిలోకి వెళ్ళేసరికి బంధువుల పెట్టెలూ, బెడ్డింగులూ ప్రత్యక్షమయ్యేయి అతనికి. 'వీళ్లంతా ఏమయ్యేరు అయితే' అను కుంటూ బాత్‌రూంలోకి వెళ్లేడతను.

బాత్‌రూంలోనుంచి అతను తిరిగి వచ్చేసరికి శాంత నేతిగిన్నెతో వీధిలోనుంచి ప్రత్యక్షమయింది.

"నెయ్యి అయిపోయింది.... రేపో అరవీశ పట్టుకురండి."

"చిత్తం...."

చురచురచూస్తూ వంటింట్లోకి వెళ్లింది శాంత. దుస్తులు మార్చు కొని బయటికి వెళ్ళదానికని అలమారులో వుదయం తనుంచిన చిల్లర

కోసం చూచేడతను. 'శాంతా' మళ్ళీ వెదుకుతూ కేకేచాడతను ఏమ య్యింది వుదయం తను అలమారులో ఉంచిన రెండున్నర?

'శాంతా....'

చరచర వంటింటిలోకి నడుస్తూ "ఏమయింది....అలమారులో చిల్లర కన్పించదు...."అన్నాడతను.

పిల్లలూ వాళ్లూ సినిమాకి వెడతామంటే యిచ్చేను. అట్లా కంగారు పడతారేం....?" చిరునవ్వుతో చెప్పింది శాంత.

పిలిస్తే పలకవేం దొరసానిలాగ....

"అవును. ఎప్పుడో దయతల్చి మీరు పిలవంగానే ఎక్కడి పనక్కడ వదిలేసి పరుగెత్తుకుంటూవచ్చి కుక్కపిల్లలలాగ గంతు లెయ్యాలికాబోలు....వారాల తరబడి మీరు మూతి ముడుచుకుకూర్చుంటే నోరెత్తడానికిమాత్రం వీలుండదు" అన్నది శాంత కూరలు తరుగుతూ.

సీతారామయ్య నిర్ఘాంతపడిపోయేడు. అయితే తను మూతి ముడుచుకు కూర్చుండటం దీనికి బాధగానే వున్నదన్నమాట! దానిసంగతి పోనీ! కుండ పగలకొట్టినట్లు యదార్థాన్నింత కచ్చితంగా ముఖంమీదనే యిది అడిగెయ్యగలదని తనెన్నడూ వూహించనైనాలేకపోయేడు. ఆమె యీ విధంగా తనబాధనువెళిబుచ్చటంతో ఆమె తిరగబడినట్లేఅన్పించింది అతనికి.

రెండుమూడు కుక్కలు కలిసి గుమ్మంలో 'భౌ' అంటూ దీర్ఘంగా రోదించసాగేయి. అతని హృదయం క్రోధంతో భగ్గుమన్నది. కర్ర పుచ్చుకొని కుక్కల నడుం విరేగేట్టు రెండు వేద్దామా అనిపించింది అతనికి. కాని వెంటనే కనుచూపుమేరలో కర్ర కన్పించకపోగా; ఆమె హృదయాన్ని ఎటువంటి నిశితపదజాలతో గాయపరుద్దామా అని లోలో పలే వెతుక్కున్నాడతను. ..ఒక్కక్షణం.

"మీ బంధువులందరికీ భోజనాలు పెట్టడమేగాక సినిమాకి పెట్టు బడి బాధ్యతకూడా నాదేనన్నమాట." అన్నాడతను.

మాటలేకుండా స్తబ్దులాగ నిలబడిపోవటం యీసారి రాంకవంత య్యింది. ఆమె ముఖం బాధతో పాలిపోయింది.

తనవాళ్ళు రావడం ఆయనకిష్టం లేనట్లు ఎన్నడూ అనలేదే తనతో. అయినా వాళ్ళిక్కడ నెలల తరబడి కూర్చిపోవటంలేదే.... రేపో, ఎల్లుండో వెళ్ళిపోయేవాళ్లే!

ఆమె లోలోపల కుమిలిపోతూండటం గమనించిన సీతారామయ్య మనస్సు చల్లబడింది. వెంటనే ఆమె బాధను గమనించనట్లు ముఖాన్ని ప్రక్కకు త్రిప్పుకొని అలమారులోని దువ్వెనకోసం వెదుకసాగే డతను.

ఎదురుగా యింట్లో కస్తూరి ఏడుపు విన్పించసాగింది సన్నగా.

"మీ ఆస్తంతా వాళ్ళు తినిపోతున్నారని నిన్నటినుంచి యింత బాధపడ్తూన్నారు, ఒక్కముక్కైనా సూచనగా అనరబోయారా? రేపే పంపించేస్తాలెండి వాళ్ళని"

దువ్వెనను గట్టిగా నేలకువిసిరి కొడుతూ సీతారామయ్య అరి చేడు "నోర్ముయ్యి"

దువ్వెన రెండు ముక్కలయిపోయింది. ఎదురింట్లో కస్తూరి ఏడుపు ఎక్కువయింది. ఢబీ ఢభీమని దెబ్బలచప్పుడు!

"అవును....వున్నమాటంటే ఎవరికైనా వులుకుకాదూ....పాపం ....మీవాళ్ళైతే బోలెడు ఆదాచేసిపెట్టేవాళ్ళు."

సీతారామయ్య క్రోధంతో శరీరం స్వాధీనం తప్పిపోసాగింది. అంత క్రోధంలోనుకూడా "మాట్లాడకిక, మాట్లాడకిక." అని అనుకో సాగేడతను. శాంత పైమాటలను పూర్తిచెయ్యగానే వుగ్రరూపంతో అన్నాడతను "ఈ పాడుకొంపలో నువ్వూ నీ బంధువులూ వున్నంత వరకూ నాకు సుఖముండదు....తెల్సిందా...." తలకొట్టైన దువ్వెకో కుండానే సీతారామయ్య గిర్రున వెనక్కి తిరిగి బయటికి నడిచేడు. గుమ్మంలో సినిమానుంచి తిరిగివస్తూన్న బంధువులు తారసిల్లేరుగాని,

సీతారామయ్య తలపంచుకునే 'వెళ్ళి ఏ 'ట్రాం' క్రిందో పడితే పీడ విరగడయిపోతుంది' అని గొణుక్కుంటూ రోడ్డు ఎక్కేడు.

సీతారామయ్య వెళ్ళి ట్రాం క్రింద పడలేదు. కాలువలోనూ దూక లేదు. తిన్నగా వెళ్ళి పార్కులోని వక వాలు బల్లపైన కూర్చుని సిగరెట్టు కాల్చుకోసాగాడు.

సీతారామయ్య భార్యమీద అలుక వచ్చినప్పుడల్లా కోపంతో ఆమెకు వినపడేటట్లుగ ఆత్మహత్యనుగురించి ఏదో గొణికి బయటపడుతుండటం అలవాటే। ఆ రాత్రంతా ఏ స్నేహితుని గదిలోనో గడిపి, వుదయమో, మధ్యాహ్నమో గృహానికి చేరుకుంటుంటాడతను. ఈ సరికే కాంత పల వల ఏడుస్తూ, తను బుద్ధిహీనురాలుననీ తనవల్లనే ఇంత పని జరిగిందనీ నలుగురికీ చెప్పేస్తుంది. తను గుమ్మంలో అడుగుపెట్టగానే పసిపిల్లలాగ బోరున ఏడుస్తూ, ముఖాన్ని చెరుగు కప్పుకొని వరుపుమీదకెళ్ళి పడు తుంది.

తన పరిస్థితుల్లోవున్న మరో మానవుడెవడైనా అయితే నిజంగానే ఆత్మహత్య చేసుకుని వుండెడివాడేమో? ఏమిటిది? జీవితమేనా అసలు? లేవడం, తినడం, ఆఫీసు, కాగితాలు, యిల్లు. తనింతవరకూ చెప్పుకో తగిన కార్యం ఏమిచేసేడు? మరి దేనికి పుట్టినట్లు తను? ఏం చేస్తున్నాడు తను?

నిద్రపోతాడు. నిద్రేనాయిది? రాత్రల్లా గుయ్యిన దోమల ఒకటే సంగీతం. అది చాలనట్లు తెల్లారి లేచేసరికి వళ్ళంతాకాట్లు। కుడి, యెడమల వాటాలలోని పిల్లలు ఆరవైనాలుగు గంటలూ వకటే ఏడుపు. పడుకున్నప్పటినుండీ కిటికీలోంచి కూరలబుట్టలవైపు ఎలుకల దూకుడు. ఇదే నా నిద్ర।

రాళ్ళతోకూడిన బియ్యం, పొడరుపాలు, కల్తీనెయ్యి ఎరువులతో కృత్రిమంగా పెంచబడ్డ కూరలు.... యిదీ తిండి।

ఇక ఆఫీసుపని. పశువులనోటికి చొప్పలందించినట్లు, ఫైళ్ళు తర్వాత ఫైళ్ళు అందిస్తుంటారు. చేతులు అరిగేట్లు తలవంచుకొని చీటి

పడేవరకూ రాయడమేపని. యంత్రంలాగా పనిచేస్తూనేవుండాలా చేతులు. నెలరోజులిట్లా రాస్తే, ఒకటోతారీఖున జాలితలచి ముష్టివేసినట్టు ఎందుకూ చాలని 80 రూపాయలిస్తారు. బ్రతకండర్రా అని. ఈ జీతానికే 'నూరేళ్లాయుస్సు' అని దీవిస్తుంది తన తల్లి.

సీతారామయ్య ఆరిపోయిన చవకరకం సిగరెట్ పైపోసారిచూసి, నిస్పృహతో విసిరిపారేశాడు దూరంగా.

అసలు తన భార్య తనతో నిజంచెప్పకుండావుంటే ఇంతవరకు వచ్చేదికాదు. ఆకస్మికంగా తనతో వున్న విషయం అనాలనే ప్రగాఢమైనకోర్కె దానికెందుకు బయలుదేరిందో? అసత్యాలతో జీవితం పొంగి పొరలిపోయి పోతుండగా యీ ఆకస్మిక ప్రేమెందుకో దానికి సత్యం పైన. ఉహూ ...అసలదికాదు—ఈమధ్య తనకేదో అవుతూంది తనలో ఏదో చనిపోతూంది. తనలో ఏదో చనిపోవడానికి ఇష్టములేనట్లు పెనగులాడుతూన్నది. ఏమిటది ...ఆత్మా? ఏమో ఏమిటో అది. అది ఏమిటైనా తను పూర్తిగా మారిపోయే టీ మధ్యను. తలుపు చప్పుడయితేచాలు వులిక్కిపడుతున్నాడు తను ప్రక్కన కుర్రాడు ఏడిస్తేచాలు తనమనస్సు వికలమయిపోతున్నట్లవుతుంది. గట్టిగా నేలమీద బిల్ల జరిగితేచాలు తన నెత్తిమీద ఎవరో సుత్తిపుచ్చుకొని కొడుతూన్నట్లనిపిస్తుంది. రోడ్డుమీద ఇద్దరు గట్టిగా మాట్లాడుకోవడంగాని, రెండుకుక్కలు మొరగడంగాని విన్పిస్తే తనకి వెర్రెత్తినట్లు అయిపోతూంది. ఏమాత్రం శబ్దాన్ని భరించ లేకుండా వున్నాడతను.

మూడేళ్ళక్రితం యీ వూరొచ్చినప్పుడు తనిట్లాలేడు. మరిప్పుడెందుకిట్లా తయారయ్యేడు తను?

కొందరు వ్యక్తులు వాతావరణాన్ని తమ వ్యక్తిత్వంతో అనుగుణ్యంగామార్చుకోగల్గుతారు. మరికొందరు వాతావరణానికనుగుణ్యంగా మారిపోతారు. తనుమాత్రం ఏదీ చేతగాక అవస్థపడుతున్నాడు. అవును. ఈ కొత్త యింట్లోకి వచ్చినాకనే తన పరిస్థితి యింత ఘోరంగా మారి పోయింది.

మొదట్లో తను మైలాపూరులో వుంటూండేవాడు. ఆఫీసుకు చాలా దూరం అది. అయినా అక్కడయిల్లు ఏకరిఖీరూ పొత్తూ లేకుండా ప్రత్యేకంగా వుండేది. అటువైపు ఇటువైపు వుంటూన్నవాళ్ళు తెలుగు వాళ్ళే అవటంవలన తనభార్యకకూడా కావలసినంత కాలక్షేపం అయ్యేది. సాయంకాలం అప్పుడు ముందుండే ఖాళీస్థలంలో ఈజీచైరు వేసుకొని కూర్చుంటే, ప్రాణానికెంతో హాయిగా వుండేది ఆ చల్లటి గాలిలో. కావలసినంత శాంతి వుండేది. అద్దెక్రింద ముప్ఫయి చెల్లిస్తున్నాగాని తనకి దిగులుండేదికాదు. కాని ఇంటాయన, కొడుకుకు పెళ్ళి చేసుకోవాలని యిల్లు ఖాళీచెయ్యమన్నాడు. అటువంటి ప్రత్యేకపుటిల్లు తనకి ఎంతంతా వెతికినా అప్పుపించలేదు మళ్ళీ. ఒక స్నేహితుడు రికమెండేషన్‌వల్ల 'మింట్'లో ముప్ఫయి రూపాయలకే తనిప్పుడున్న భాగం దొరికింది. ఏదో నరకాని చేరేటిందులోతను.

[illegible] ఆఫీసుకు చాలా దగ్గర. పంపు, ఎలెక్ట్రిసిటీ అన్నీ వున్నాయి. [illegible] ఇప్పుడు కూడా [illegible] సినిమాహాల్ [illegible] ఏ [illegible] చూడనివ్వరు. మద్రాసులో ప్రతివాళ్ళూ [illegible] ఇట్లాగే బాధపడుతున్నారంటారు. ఒక మిత్రుడు.

తన పక్క [illegible] వాటాలో పక అయ్యంగారు. [illegible] మలయాళీలు. ఎదురుంగా తెలుగువాళ్ళు వుంటున్నారు. ఇంకా ఆ మేడలో వున్న మిగతా ఆరు వాటాలవాళ్ళు ఎవరో తనెప్పుడూ పట్టించుకోలేదు.

ఆఫీసునుంచి యింటికిరావడం అంటే భయం వేస్తుంది. మెట్లముందు కొచ్చేసరికల్లా భొయ్యిమంటూ కుక్కలగోల మొదలవుతుంది. పాలు లేవు కొత్తావేదు, మీదపడి పిల్లలంత హడావుడి చేస్తాయి. యజమానురాలి పిల్లలు గుమ్మాల్లో దారిపొడుగునా నుంచొని. "షర్మా లేదు... ఉదేకు కరిచదు.... ఏయ్ జాకీ.... ఏయ్ జానీ" అని సందడిస్తూంటారు. ఈ కుక్కలను తప్పించుకొని వసారాలోకి ప్రవేశించేసరికి ఏ టెన్నిసుబంతో 'రయ్'

మంటూవచ్చి ముఖంప్రక్కనుంచి దూసుకుపోతుంది. ఇంకో అడుగు ముందుకువేసేసరికి ఎడంకాలో, కుడికాలో జర్రున జారిపోతుంది. తీరా క్రిందచూస్తే అరటిపండు తొక్కలు ఇవి తప్పించుకొని అవతలపడేసరికి కాళ్ళ సందునుంచి, యీ మూలనుంచి ఆమూలనుంచి తోసుకుంటూ పరుగెత్తే పిల్లల మూక ! సరిగ్గా మేడమెట్లను చేరేసరికి, మేడమెట్లమీద నుంచి క్రిందకు దుమ్మును వూడుస్తూ దాసీమనిషి ప్రత్యక్షమవుతుంది. సిగరెట్ పీకలు, కాగితంముక్కలు. దుమ్ము ధూళీ ముక్కుపుటాల్లోకి, కండ్లలోకి ఎగురుతూండగా వుక్కిరిబిక్కిరై పోతూ, ముఖాన్ని చేతిరుమాలుతో కప్పుకొని, పనిమనిషిని తిట్టుకుంటూ మేడమెట్లపైకి చేరేసరికి, తమవాటాకు ఇవతలగా, ఈమూలనుంచి ఆమూలకు అయ్యర్‌గారి భార్య మడిబట్టలు అడ్డంగా కట్టబడివుంటాయి. వంగి వంగి నడుస్తూ, వాటి నెట్లానో తప్పించుకొని తనింట్లోకి చేరుకునేసరికి ప్రక్కవాటాల్లోని పిల్లల్లో ఎవళ్ళో వకళ్ళు రోధన ప్రారంభిస్తారు, ఎప్పుడు కొంపలోనుంచి బయటపడదామా అనిపిస్తుంది. ఇక రాత్రల్లా దోమలు, గాలి లేకపోవడం....యిదీ జీవితం. ...

పన్నెండింటి ఆకలివేయడం గ్రహించేడు సీతారామయ్య. నిదానంగా పార్కుచుట్టుపక్కల చూచేడతను. పార్కు అంతా నిర్మానుష్యంగా వుంది. రేడియోలో సంగీతంకూడా ఎప్పుడో ఆగిపోయింది గడియారం చూచుకున్నాడతను. పదిన్నర అయింది.

ఎక్కడికి ఎళ్ళాలా అని ఆలోచనలో పడ్డాడతను మళ్ళీ. కొంపకు వెళ్ళడానికా భయంవేస్తూందాతనికి. స్నేహితుల యిండ్లలో గడుపుదామా అంటే ఎన్నాళ్ళిట్లా ? అసలీ సమస్య యివ్వేళ పరిష్కరించాలి తను. ఈ అశాంతికి, ఆవేదనకు కారణం ఏమిటి ? దీనికి పరిష్కార మేమిటి ?

తనెన్నడూ ఓపికతో ఆలోచించలేదు గాని, అసలు సమస్య దరిద్రంలో వుంది ; వాతావరణంలో వుంది. తనీ నరకంలాంటి కొంపలోకి వచ్చేననేకదా తనకి శాంతి సౌఖ్యాలు దూరమైపోయేయి. తనకి వాతావరణం అనుకూలంగా వుండకపోవడం వల్లనేకదా తనిట్లా మారిపోతు

న్నాడు, నవ్వుకున్నాడతను. అనుకూల వాతావరణం! అనుకూల వాతావరణంలో పూర్వంలాంటి ఇల్లు మళ్ళీ ఇప్పుడు కావాలంటే తను అరవై రూపాయలైనా ఇచ్చుకోడానికి సిద్ధపడి వుండాలి. సౌరాష్ట్ర నగరంలో కూడా యాభయికి దొరకదు తనంత అద్దె భరించడం కలలోకూడా సాధ్యంకాదు కనక తనకు నచ్చిన ఇల్లు కావాలనేమాట మరచిపోవాలి తను. అంతే. తనకు శాంతి దూరం, సౌఖ్యం దూరం.. అంతేనా .. అంతే ...

ఇక తనిప్పుడు చెయ్యవలసిందల్లా....వున్నదాంట్లోనే సర్దిపెట్టుకోవడం నేర్చుకోవాలి.. దోమలు కరుస్తున్నాయని, కుక్కలు మొరుగుతున్నాయని, ప్రక్కపిల్లలు ఏడుస్తున్నారని భార్యపైన చికాకుపడకూడదు. తను అన్ని బాధలకూ అలవాటు పడాలి....వాటికి వాటికి అలవాటుపడితే అవి బాధలేకావు....! బాధలయితే, మిగతా వాళ్ళంతా ఎట్లా వుంటున్నారు తనుండే వాతావరణంలోనే....

నిజమే... తను బాధలనుకున్నవాటిని కూడ ఆనందంతో స్వీకరించాలి....లేకపోతే వేరేమార్గం లేదిక తనకీ జన్మలో!

చీకటితో నిండిన పార్కులోంచి నిశ్చితాభిప్రాయంతో లేచేడతను—తప్పనిసరిగా ఇంటికి వెళ్ళడానికి!

# కళాకారులు

'ఆవేదనతో వ్రాసిన రచనే సూర్యుడినుంచి వచ్చే కాంతిలా వుంటుంది. ఏదో వ్రాయాలని వ్రాసిన రచన, కిరసనాయిలు బుడ్డినుంచి వచ్చిన వెలుతురులాగే వుంటుంది. ఎవరబ్బా యీ మాటలు అన్నది? యిప్పటికి మా రచనలు మరి ఎట్లా వుంటున్నాయి-' ఆలోచిస్తూన్నాను కాఫీహోటలులో కూర్చుని.

ఆలోచించక చేసే దేముంది? మానవులమధ్యకి, జన సంకీర్ణం లోకి వెళ్ళడానికే భయం వేస్తోంది యీ మధ్య. అంతా కలసే వుంటారు. నవ్వుతూనే వుంటారు, పొగడుతూనే వుంటారు, కాని ముఖం పక్కకు తిప్పగానే గబగబా గోతులు దీస్తారు; ఎత్తిపొడుస్తారు, హేళనగా మాట్లాడతారు. ప్రస్తుతం సమాజంలోని మానవులకి నైతిక విలువలు తగ్గి పోయేయని తనకి తెలుసుగాని, తెలిసే వీళ్ళందరి మధ్యకు వెళ్ళి మన స్సును ఎందుకు బాధపెట్టుకోవాలి? బాధపడటం తనకు సహజం, వాళ్ళ స్వభావాలకు అనుగుణంగా ప్రవర్తించడం వాళ్ళకు సహజం, మరింత బాధపడటం ఎందుకు? ఒంటంగా యీ ఆలోచనల్తో మనస్సును పాడు చేసుకోక వాళ్ళందరితో కలిస్తే కాస్సేపైనా యీ బాధ తప్పుతుందేమో? మంచి ఆర్గ్యుమెంటే..., ఆలోచించాలి.

లక్ష్మణమూర్తి నవ్వుతూ, 'ఏమిటోయి తెగ ఆలోచించేస్తున్నావు. పరిషత్తుకి నాటకం ఏమైనా ఆలోచిస్తున్నావా ఏమిటి' అన్నాడు లోప లకు - నేనున్నవైపుకే వస్తూ.

'అబ్బే, లేదు. కూర్చో. నువ్వేదో రాసేపుటగా.,..ఎవరైనా తీసు కెళ్లుతున్నారా?' అన్నాను.

లేదోయి మన నాటకాలు ఎవడికెక్కావాలి'....?అన్నాడు కూర్చుని.

'అవున్లే....నాటకం రాయగానేసరా.. దానిని ఆడించుకోడానికి ఆడేవాళ్ళను పట్టుకోడానికి ఎన్ని తిప్పలు పడాలి?' అన్నాను.

'ఓ కాఫీ పట్టుకురావోయి!' అని సర్వరుతో చెప్పి నిట్టూరుస్తూ నా పక్కన కూలబడ్డాడు లక్ష్మణమూర్తి.

లక్ష్మణమూర్తంటే బాహుశా ఎరగనివాళ్ళుండరు. ఎక్కడనాటకం ఆడుతున్నా మనవాడు వెళ్ళి చూసొచ్చి మర్నాడంతా వాళ్ళనిగురించి, వాళ్ళ నటననిగురించి మాట్లాడుతూంటాడు. ఎమెచ్యూర్ నాటకాలు ఆడించడం మానేసి నాటకాలు వ్రాసేసి కళామ తల్లికి చేతనైన సేవ చేస్తున్నాడు.

'మనవూరినుంచి ఏం నాటకాలు వెళ్తున్నాయో తెలుసా?' అడిగేను. ఏదో మాట్లాడించాలని!

'ఆ...వెళ్తున్నాయి చెత్తనాటకాలు, అయిదారువరకూ. నేను ఛాలెంజీచేసి చెబుతా,..యిందులో వక్కటీ సెలెక్టు కాదు '

ఆదేమిటోయి...అంత వుద్రేకమెందుకు...నెమ్మది'అన్నాను,

'కాదోయి, లేకపోతే, ఏమిటీ యీ నాటక సమాజాలూ పీన్యాను. ఆ 'కాగడా సమాజం' వాళ్ళు నా ప్రాణం తీయించి 'ఇనక వర్ర' నాటకం వ్రాయించేరు. సీసుకో టిన్ను చొప్పున పథ్నాలుగు టిన్నులు ఖాళీచేసి ఆ నాటకం పూర్తిచేశా, నిద్రాహారాలు మాని. ఇవ్వేళ దారికెంతో తెలుసా....పదహారు.... యింకా నాలుగురోజులుంది ముగింపు తేదీకి. వారంక్రితం ఏమన్నారో తెలుసా?....ఈ నాటకం చాలా బావుందండి. కాని 'హీరో' వేషం మన వాళ్ళెవరూ వెయ్యలేరు ..ఏ పృథ్వీరాజో వెయ్యాలి అన్నారు ఏమిటి వాళ్ల వుద్దేశం? నేను వెర్రివెధవననా? ఏమిటంటావు?' అని నా జవాబుకోసం ఎదురు చూశాడు లక్ష్మణమూర్తి.

'వూ....అయితే ఏం చేసేవు మరి?' అన్నాను.

'నేను ఆ జోగారావుగాడికంటే నాలుగు ఆకులు ఎక్కువే చదివే ....నువ్వు పృధ్వీరాజులా వుంటావు కదా....నువ్వు వేసెయ్యవోయి అన్నా, ఆ మాటతో వుబ్బి చచ్చేడు.'

'అన్నన్నా....ఆఖరికి సాధించేవన్నమాట!' అన్నాను....

'సరే అక్కడితో అయిందనుకున్నావా? యిది వారం క్రితం సంగతి....మూడు రోజుల క్రితం మళ్ళీ నా దగ్గరకొచ్చి, 'యీనాటకానికి' 'సెట్'కి చాలా అవుతుంది....మా సంఘానికి పది రూపాయలుకూడా 'ఫండ్' లేదన్నాడు. నా ప్రాణం ఎగిరిపోయిందనుకో. కాని ఏంచేస్తాం? ....'సెట్' లేకపోతే నాటకం తగలడి పోతుంది....సరే 'సెట్' గొడవ నేను చూసుకుంటాలే .... అన్నాను గాని ఛస్తున్నా .... డబ్బెక్కడా పుట్టడంలేదు....ఏం చేస్తాం? మా చెల్లెలు 'వడ్డాణం' తాకట్టు పెట్టించి మూడొందలు పట్టుకొచ్చి తలుపులూ ద్వారబంధాలు చేయించి వాళ్ళ మొఖాన పడేసేను.'

'సరే, ఇంతకీ వక దోవలో పడ్డావన్న మాటేగదా!' అన్నాను జాలిపడుతూ.

ఏమిటోయి అట్లా మాట్లాడుతావు అన్నీ తెలిసీ? నాటకం అన్నాక మాటల్తో అవుతుందా,.. నిన్న వచ్చి చెప్పేడు మళ్ళీ. జోగారావుగాడు 'లలితకి కడుపనీ, ఇంకోరి నెవరినైనా 'బుక్'చెయ్యాలనీని.'

'నీకేం దానికి కడుపైతే? ఇంకో 'స్టార్'ని చూసుకోలేరూ

'ఏడిసినట్లే వుంది.... నాటకం నాదికదా.... 'కమలని' వెళ్ళి బ్రతిమాలే.... ఆవిడ ఎవరికో ఇంకో సమాజానికి ముందే మాట ఇచ్చేసిందట.... మాటలకేం లేస్తూ అని ఓపాతిక ఎడ్వాన్సు యిచ్చి వచ్చేసేను.' వాంతి అవ్వబోతూన్న ట్లనిపించింది నాకు. నెమ్మదిగా కాస్సేపు కళ్ళు మూసుకుని కుర్చీలో వెనకకు జేర్లబడ్డాను.

లక్ష్మణమూర్తి అంటున్నాడు 'మురహరిరావు, సుబ్బారావు వేషం తప్ప తనేదీ వెయ్యనని యివ్వాళ పట్టుదల పట్టేడుట.... వాడిని కాళ్ళు కడుపు పట్టుకుని బ్రతిమాలుకోవాలి .... యిది వెళ్ళిందనుకోకు; దీని కింకా ఎన్ని అటంకాలో.... నీకే గొడవా లేదు, హాయిగా వుంది నీ పని. మరి వెళ్లొస్తా.' బిల్లు అక్కడే వదిలేసి హడావుడిగా వెళ్ళిపోయేడు అతను.

నిట్టూరుస్తూ సిగరెట్ వెలిగించుకుని, అనుకున్నా వుహూ ... ఏదే మైనా యితన్ని నేను అసహ్యించుకోకూడదు. మానవ సహజమైన బలహీనతలవల్లే అత నిట్లా ప్రవర్తిస్తున్నాడు. ఈనాడు కాకపోతే రేపైనా తన పొరబాట్లను తను గ్రహించడా? ఈలోగా అతనిలోని మంచినే మెచ్చుకోగలగాలి.... నాటకాలంటే ఎంత అభిమానం అతనికి! చెల్లెలు నగల్నికూడా తాకట్టు పెట్టేశాడు!

వెనక్కి తిరిగి చూసేసరికి నాలుగైదు కుర్చీల కవతల మురహరి రావు కూర్చుంటున్నాడు ఒక కుర్చీలో. వాడి కళ్ళబడితే యీ నాటకాల గొడవ మళ్ళీ ఎక్కడ మొదలెడతాడోనని బిల్లు చెల్లించి త్వరత్వరగా బయట పడ్డాను.

బయటపడ్డానన్న మాటేగాని 'చౌకు'కు వెడితే గోపాలం కన్పి స్తాడు; వాడి ఆకలి కవిత్వం వినలేను. కాలవవైపుకు వెడితే ఆఫీసువాళ్లు కన్పిస్తారు; వాళ్ళు బయటకూడా ఆఫీసు కాగితాలను గురించే మాట్లాడ తారు!

మైదానంవైపు నడుస్తూన్నా ఎవరూ వుండరని. ఎదురుగా జోగా రావు వచ్చేసాడు.

'కులాసాయేనా.... కన్పించటంలేదు' అన్నాడు.

'ఏదో యిట్లా వున్నాను.' అన్నాను నా వెనకాలే నడవసాగాడు జోగారావు.

'ఇసక పర్ర అనే నాటకం వేస్తున్నారుట. రిహార్సులు ప్రారం భించేరా?' అన్నాను.

'లేదుండీ ఏదీ సిద్ధం కాలేదింకా .... మీరో నాటకం రాసి పెట్టకూడదూ?' అన్నాడు.

'అబ్బే నే నెప్పుడో నాటకానికి దణ్ణం పెట్టేసేను ఏం — లక్ష్మణమూర్తి బాగానే రాస్తాడుగా?'

'ఏం రాయడమండీ రాయటం! పైగా ఆయన తో చావండీ ఫుల్ సెట్'తో ఆడాలంటాడు, 'సెట్స్ తను చెప్పినట్లు వుండాలంటాడు .... యిక్కడవాళ్ళు చాలనట్లు మద్రాసునుంచి హీరోయిన్ వేషానికి అమ్మాయిని తేవాలంటాడు.... ఛస్తున్నాం...'

'ఏదో సర్దుకుపోవాలోయి.... డబ్బు కట్టేసేరా పరిషత్ కి?'

'లేదు ఎల్లుండివరకు టైంవుంది. చూస్తున్నాం నిన్నసాయంత్రం ఆయనొచ్చి సుబ్బారావు వేషానికి మురహరి పనికిరాడని గోల. అయి దేళ్ళనుంచీ చిన్నవేషాలు వేస్తున్న అతనికి యింకెప్పుడండీ మంచివేషం యిచ్చేదీ? ఇదంతా ఎందుకు, మంచినాటకం ఒకటి చూద్దురూ .... పరిషత్ కి తీసికెళ్ళే పూచీ నాదీ..'

'అబ్బే నేనేమీ రాయలేను... కావలిస్తే అతనికి మాట యిచ్చేరు గనక, యింకోటి చిన్నదేమైనా వుందేమో అతన్నే అడిగి చూడండి, బావుంటుంది' అన్నాను.

'సరేలెండి.. అయినా వీలుంటే ప్రయత్నించండి.. ఇంకా టైముంది. రెండు రాత్రుళ్ళలో రాసెయ్యొచ్చు తల్చుకుంటే.. ఆరెదే రీహార్సల్సుకి వెళ్లాలి, మరిచిపోయే.. అంటూ చకచకా వెళ్ళిపోయేడతను.

జోగారావు బహు చిత్రమైన వ్యక్తి. 'జాగ్రత్త! అతనిలోని మంచినే చూడాలి.' హెచ్చరించుకున్నాను. కళంటే అన్నాహారాలు అక్కరలేదు ఆరోగ్యం లెఖ్ఖచెయ్యక్కరు. నాటకాలు బాగా నటించాలి.. ఇంకా బాగా! నాటకాలు.. యింకా నాటకాలు. ఇదీ అతని పాలసీ!

నవ్వుతూ మాట్లాడతాడు. ఎప్పుడూ ఉత్సాహంగా వుంటాడు. నాటకాలే జీవితం, నాటకాలే భోజనం, నాటకాలే విశ్రాంతి, నాటకాలే కళ, నాటకాలే సంసారం. కళాకారుడంటే అట్లా వుండాలి!

'ఏంరోయ్.. !'

ఉలిక్కిపడ్డాను. రంగదాసు, 'ఇట్లా వస్తున్నావేం?' అన్నాను.

'జోగారావుకోసం.. ఎక్కడైనా కనపడ్డాడా?'

'ఇందాకే యిట్లా వెళ్ళిపోయేను?' అన్నాను.

'ఈ రంగముందే- యిదొక నరకం. ముఖ్యంగా యీ నాటక రంగంలో పడ్డవాడి సంగతి చెప్పాలా? 'మర్మార్థుడు నన్ను అయిదింటికి రమ్మని 7 గంటలకు వచ్చి వెళ్ళిపోతాడా?'

'ఏమిటోయ్. ఏం జరిగింది?'

'నన్నో నాటకం రాయమన్నాడోయ్. రాసియిచ్చేను పాతిక రూపాయలు యిస్తా నన్నాడు.... అదిగో యిదిగో అంటాడు. యివ్వడు. పోనీ పరిషత్‌కు తీసుకెళ్లవయ్యా. అంటే, కొంచెం మార్చాలి అంటాడు....ఏం మార్చాలో చెప్పడు....ఆ లక్ష్మణమూర్తి గాడి చేత కూడా రాయించేడుట. వాడిది తీసికెళ్తాడేమో ? వాడికి డబ్బుంది!' అన్నాడు.

'నీతో పరిషత్‌కు తీసుకు వెడతానన్నాడా జోగారావు?' అని అడిగాను.

'అవును. అట్లాగంటేనేగా వారం రోజుల్లో రాసి ఇచ్చా హడా విడిగా. వాడేవొచ్చి పాతికరూపాయలిస్తా. పరిషత్‌కు వో నాటకం రాయండి అన్నాడు. డబ్బుకు నేను పడుతున్న ఇబ్బంది తెల్సుగా. పాతిక రూపాయలు ఎందుకైనా వుంటాయి కదా అని చచ్చిచెడి రాస్తే యిదా బహుమానం!'

యిద్దరం మౌనంగా చౌకు వరకు వచ్చేం. జోగారావు 'గౌరీపతి' వేషం ఎంత చక్కగా వేస్తాడో నెమరు వేసుకుంటున్నా యింతసేపూ. 'వస్తా' అంటూ దూరంగా వెళ్తూన్న మనిషికోసం పరుగెత్తేడు, రంగ దాసు, అకస్మికంగా.

రంగదాసు మంచి రచయిత, నాటకాలూ, కథలూ చాలా శక్తి వంతంగా రాస్తాడు. ఎవ్వరిజోలికి అనవసరంగా పోడు ఉద్యోగం లేదు సద్యోగములేదు. ఉడతాభక్తి సాహితీసేవ చేస్తుంటాడు.

సిగరెట్ కోసం తడుముకునే సరికి అగ్గిపెట్టె, సిగరెట్ పెట్టె రంగదాసు చేతికిచ్చినట్లు గుర్తు కొచ్చింది. సిగరెట్ దుకాణం వైపు నడుస్తూంటే కమల మొగుడు ఎదురయ్యేడు.

'ఖులాసాయేనా ?' అన్నాను.

'ఆ. మీదయవల్ల, రంగదాసుగా రటు పరుగెత్తా రెక్కడికి ?

'ఏమో, జోగారావు కోసమేమో ?'

'ఏం జోగారావండి ? మీరైనా చెప్పండి తాత. 80 రూపాయలు అడ్వాన్సు ఇచ్చా - నాటకం ఒకటి రాసి యిస్తానంటే ... యింతవరకూ నాటకం ఇవ్వడు. డబ్బు ముదరా యివ్వడు....నన్ను చూసి పుంజాలు తెంచుకొని పరుగెత్తాడు గానీ ! పోసీ యింకోరి కిచ్చేసేసని కూడా చెప్పడే ?'

'నీ కెందుకయ్యా నాటకం....మీ ఆవిడ, లక్ష్మణమూర్తి నాట కంలో వేషాలేక వప్పుకుంటదటగా'

'భలేవారే....యిదొకటా....ఎవరా మాటంట ? ఊసాంతినొంత నాటకం తీసికెళ్ళాలసు కుంటుంటే'

'కాగితం కూడా రాసిచ్చిందని విన్నానే....'

'ఒట్టిదండీ....ఎవడా చెప్పిన..'

నాతల తిరుగు తూన్నట్లని పించింది. సిగరెట్ తీసుకుని గబ గబా యింటివైపు నడుస్తూ నాటకాలు, నాటకాల వాళ్ళని మరిచిపో ప్రయత్నించటానికి ఏదో ఒకటి ఆలోచించాలనీ 'జీవితం అద్భుత మైంది. మానవుడికి సృజనాశక్తి వుంది. మానవుడు జీవిస్తున్నాడు.... సృజిస్తున్నాడు .ప్రతిక్షణం వక యుగం .ప్రతి యుగం..వక క్షణం..

జీవితమే ఒక నాటకం..నాటకంలో పాత్రలు రచయితకు బానిసలు.. నిజానికి మానవు లంతా మంచి వాళ్ళే..ఒకోప్పుడు 'స్వార్థానికి లొంగి పోతుంటారు. చెడ్డవాళ్ళలా కనిపిస్తుంటారు..'

ఆలోచనలు ఒక్కసారిగా ఆగిపోయాయి. దూరంగా, మా గుమ్మంముందు నిలబడివున్న నాగేశ్వర్రావును చూచి నాగేశ్వర్రావు రాజమండ్రిలో వో నాటక సంఘానికి సెక్రటరీ! వెంటనే గుర్తుకొచ్చింది, అతనికి నాటిక వకటి రాసిస్తానని నేను వగ్దానం చేసిన విషయం.... పాపం 'ప్రైం' అయి పోతున్నదని తనే స్వయంగా వచ్చేసినట్లున్నాడు, లీలామహలులో చాలామంచి సినిమా వుంది..యివ్వాళతో ఆఖరు రోజనే విషయం కూడా అప్పుడే గుర్తువచ్చింది. చటుక్కున నాగేశ్వర రావు నన్ను చూడకుండా ఎడమ సందులోకి తిరిగి రిక్షా ఎక్కి 'సినిమా హాలుకు' పోనియ్యమన్నాను.

మరి ఏంచేస్తాం..నేను వ్రాసిన నాటికను 'కమల' బలవంతం చేసి తీసుకు పోవడం?.అదంతా వేరే పెద్ద కథ కదా!

# స్మృతిలోని శ్రుతులు

చిక్కటి నిశ్శబ్దం పొగమంచులా గదినిండా ఆవరించుకొని కూర్చుంది. అతనూ నిశ్శబ్దంలాగేనిశ్చలంగా వున్నాడు, తొమ్మిదయినా రంగారావు యింకా రాలేదు....భోజనానికికూడా. ఆలోచన పోతూంది. ....ఏం చేస్తున్నాడో యింతవరకూ భోజనానికి రాకుండా ?

బల్లమీద 'ఆడెన్' బరువుగ బాధగా మూలుగుతున్నాడు. మరి రెండు పద్యాలు దరిద్రంతో, ఆకలితో, దుర్గంధంతో నుందుకు దొర్లి నాయి, తిరిగి ఆలోచన....యీ పాటికి బయలుదేరి వుంటాడు రంగారావు యింటికి.

గోడమీద ప్రాకులాడే బల్లిని మింగడానికి ప్రయత్నించే పిల్లి ఒక్కక్షణంపాటు తన దృష్టిని ఆకర్షించింది. లేచేడు అతను. కిటికీ లోంచి బయటకు చూస్తున్నాయి అతనికళ్ళు. కళ్ళానినంత మేర బయట దట్టమైన చీకటి. వెన్నెలలో తనను పులకరింపజేసే కింది వుద్యానవనం లోని పూలవృక్షాలన్నీ చీకట్లో ఎట్లా దాగున్నాయో ;

కిర్రుమంటూ తలుపు తెరుచుకుంది. అతను ఆలోచనలను తెంచు కుని ఆదుర్దాగా వెనక్కి తిరిగేడు. బూట్లచప్పుడుతో, వాడినమొహంతో, జీర్ణించిన విరక్తిలా, నిస్పృహలా రంగారావు లోపలికొచ్చేడు.

కోటుతీసి ఎంకెన వేస్తూ "ఇంకా భోజనం చెయ్యలేదూ—నాన్న గారూ" అన్నాడు.

కుర్చీలో కూర్చుని తిరిగి 'ఆడెన్'ను చేతిలోనికి తీసుకుని అన్నాడు అతను— "తిన్నాను రంగా - తిన్నాను. అమ్మాయి పాపాయిని నిద్ర పుచ్చుతూ పుచ్చుతూ తను కూడా నిద్రపోయినట్లుంది. ఇంతవరకేం చేస్తు న్నావురా? నెలల కుర్రాడిని యింట్లో పెట్టుకుని యిట్లాచేస్తే ఎట్లా"

టపేర్ భుజాన వేసుకుంటూ "క్లబ్‌లో పాతస్నేహితు లెవరో కన్పిస్తే అట్లాగే కూర్చుండిపోయేనండీ. అదికూడా భోజనం చేయక పోయిందా ?" అంటూ లోపలికెళ్ళేడు.

అనుకున్నాడు అతను శూన్యంగా 'ఆడెన్' లోకి—'అవును సంవత్సరంనుంచి యిట్లానే రోజూ పాతస్నేహితులు కన్పిస్తున్నారు- వీడికి !

లేచి నిలబడ్డాడతను పుస్తకాన్ని బల్లపైన వుంచి. అడుగులు నెమ్మదిగా కిటికీవైపు పడ్డాయి. కళ్ళు శూన్యంనుంచి చీకట్లోకి చూస్తు న్నయ్. 'ఏముంది, అంతా చీకటి !' అనుకున్నాడతను మెల్లగా.

ఆకస్మికంగా చిన్న పిల్లవాయువు. వాయువులో తేలుతూ, తన నెక్కడికో తేల్చివేస్తూ సంపెంగవాసన!

సంపెంగలు ! వాటిమధ్య ఎన్ని స్మృతులో....స్మృతులమధ్య మాధుర్యమెంతో....విషాదమెంతో !

పోర్తియర్ చదువుతున్న రోజులు. లాబరేటరీ ముందునుంచి వస్తున్నాడు తను. అప్పుడే వర్షం కురిసి వెలిసివుండడంవల్ల గాలి సడిగా చంపలను తాకుతూంది జారకుండా జాగ్రత్తగా నడుస్తున్న తను ఆకస్మి కంగా ఆగిపోయేడు. ఎక్కడినుంచో కమ్మటి వాసన ! తలెత్తి రెండు వైపులా చూచేడు పక్కనే లాబరేటరీ కిటికీలో ఆమె జడలో సంపెంగ. నిలబడ్డాడు అట్లనే తను ఎవరో ఆమె అని చూస్తూ. ప్రాక్టికల్ చేస్తున్న ఆమె ఎందుకో కిటికీవైపు తిరిగింది. ఫూలిష్‌గా నవ్వగలిగేడు తను మాత్రం. అర్థం చేసుకున్నానన్నట్లు మాత్రం. చిరునవ్వొకటి వదిలి తలతిప్పేసుకున్నది సుమిత్ర.

రిజల్ట్సు వచ్చేయి. తన పరీక్ష పోయింది. ఆమె ప్యాసయింది. ఆ సాయంత్రం బజారునుంచి వొస్తున్నాడు తను. వికలంగా వుంది తన మనస్సంతా. తనకు తెలియకుండానే, స్వప్నంలోవలె నడుస్తున్నాడు తను. చటుక్కున తన పాదాలాగిపోయినయి, ముక్కుపుటాలు ఆనందంతో ఎగురు

తున్నాయి. పక్కనే పూలదుకాణంలో సంపెంగలు కొనబోతున్నాడు తను నాలుగుపూలను.

వెనకనుంచే ఆమె "చాలా విచారిస్తున్నాను - మీ పరీక్ష పోయిం దట." అన్నది.

అదిరిపడ్డాడు తను. ఏదో జవాబిచ్చేడు. రెండు సంపెంగలు ఆమె కిచ్చేడు. కృతజ్ఞత తెలియపరుస్తూ, ఏమేమో మాట్లాడసాగింది. ఇంటి కని తెల్సుకుని, తనూ అటే వెళ్ళాలన్నాడు. సంభాషణంతా సంపెంగ లను గురించే ఇద్దరికి ఎంతో ఇష్టం అని!

పెళ్ళినాడు, కార్యంనాడు కూడా అవి ప్రముఖపాత్రవహించేయి తను జీవిత రంగంలో.

తర్వాత తర్వాతకూడా, తాము వంటరిగా ప్రపంచాన్నొదిలేసి' వకరిలో మరొకరు లీనమైన నిశీధుల్లోకూడా, సుమిత్ర లేచి కూర్చుని అడిగేది. "మీకు వెయ్యటంలేదూ సువాసన" అవును. వేస్తుందేది.... ఎక్కడినుంచో దూరప్రదేశాల్లోంచి గాలిలో చల్లగా తేలిపోయే సంపెం గల సువాసన?

తర్వాత మూడేళ్ళుకూడా యిట్లాగే మధురంగా, మూడుక్షణాలు లాగ తరలిపోయేయి.

ఆ రోజు ఆఫీస్‌నుంచి బయటకి వచ్చేడు పనిముగించుకుని నాలు గడుగుల్ని ముందుకు సాగకుండానే వెనకనించి 'సంపెంగలు, సంపెం గలు' అని కేక. వెనక్కి తిరిగేడు తను, కుర్రాడిచేతిలో పావలా పడే సేడు. 'సంపెంగలు చేతిలో వేసుకున్నాడు. ఆనందగా వాసన చూస్తూ, నడక సాగించాడు.

'బావోయ్' వెనకనుంచి కేక.

వెనక్కి తిరిగాడు తను ఆశ్చర్యంగా, తన బావమరది. ఉత్తరం వేసేఁటట చెల్లెల్ని పిల్లాడిని. అమ్మని తీసుకొస్తున్నానని తనకి అందింది కాదు- ఎందుకనో?

"అంతా కులాసాయేనా? కుర్రాడెట్లా వున్నాడు?" గట్టిగా తిరిగి సంపెంగల నోసారి వాసనచూచి భద్రంగా కోటుజేబులో వేసుకున్నాడు.

ఇద్దరూ ఇంటివైపు నడుస్తున్నారు.

బావమరది వున్నట్లుండి అడిగేడు "ఎవరి పోలికోయి?"

"నువ్వు చూసేవుగా చెబుదూ?"

"ఏం నువ్వు చూసేవుగా," అన్నాడు బావమరది.

నిజమే, కాని మూడునెలల క్రితం. అప్పటికింకా కుర్రాడికి వార మన్నా వెళ్ళలేదు. మాంసంముద్దలావున్న ఆ కుర్రాడికి ఏను పోలికలేం పట్టగలడు? పైగా తనామె ఆరోగ్యాన్ని గురించి బాధపడ్తూనప్పుడు- కుర్రాడిసంగతేం ఆలోచించేదుకనక,

అదే చెప్పేడు అతను నవ్వుతూ బావమరదితో. "ఆమెను చూడ టానికి వెళ్లేనుగాని, వాణ్ణిగురించి కాదుగా." అన్నాడు కూడాను.

బావమరది పెదిమ కొరుక్కుని "మొదట్లో అందరూ అంతేలే. నేనూ యిట్లాగే మాట్లాడేను. తల్లీ పిల్లా యింటికొస్తేనే కాని ఫోరణి మారదులే." ఎక్కడికో చూస్తూ యింకా అన్నాడు "తండ్రిలాగ ఫీల్ కావటంలేదూ నువ్వు?"

అంతే? స్నేహితులంతా భుజాలు తట్టేరు. కరస్పర్శ చేసేరు. కాఫీలు తాగేరు. కాని యింకా యిదిమాత్రం అర్థంకాలేదు. "ఎట్లా వుంటుందా ఫీలింగ్?"

వెకిలిగా నవ్వి "ఇంకొన్నాళ్లపోనీ-నీకే తెలుస్తుంది" అన్నాడు.

అతనేమీ మాట్లాడలేదు. మౌనంగా నడవసాగేడు. ప్రశాంతంగా మెదడు ఆలోచనలకు తావివ్వసాగింది. రేపటినుంచీ తిరిగి తనూ ఆమె యథాప్రకారంగా నదిపడ్డున చల్లటిగాలిలో గంటలకొద్దీ మాట్లాడుకుంటూ కూర్చోవచ్చు. మంచువంటి వెన్నెలలో దొడ్లోని కొబ్బరిచెట్లుకింద కూర్చుని, తళతళలాడే లకులమధ్యనుంచి చందమామ అందాన్ని, ఆమె అందంతో తిరిగి పోలికలు కట్టవచ్చు.

అడుగులు గబగబ పడుతున్నాయి బావమరది పిల్లలను ఎట్లా జాగ్రత్తగా చూడాలో చెబుతున్నాడు. పరధ్యానంగా 'వూ'కొడుతూ నడుస్తున్న తనకి సమ్మంలో అత్తగారు అవుపించింది.

"కులాసాయేనా?" అంటూ బూట్లు చప్పుడుకాకుండా తిన్నగా తను మేడమీదకు నడిచాడు

మంచంమీద పడుకుని వున్నది సుమిత్ర అటుతిరిగి. దీర్ఘమైన ఆమె కురులు నల్లగా మెరుస్తూ పక్కనిండా పరుచుకుని వున్నాయి.

నెమ్మదిగా మంచం చివర కూర్చుని ముందుకు వంగి ఆమెను ముద్దెట్టుకున్నాడు. అదిగాడు వెంటనే 'మూడు నెలలయింది నిన్ను చూసి, ఇన్నాళ్లెల్లా వుండగల్గేవు! 'సు'?"

ఆమె నవ్వుతూ లేచి "ష్! నెమ్మది! అబ్బాయి లేస్తాడు. స్టేషన్ కన్నా వచ్చావుకాదేం?"

ఉత్తరం అందితేనా! ఆలస్యంగా పోస్టుచేసేవుకాబోలు. అన్నట్లు 'సు' నీకోసం ఏం తెచ్చానో చెప్పుకో." కోటుజేబులోకి జొరబడ్డాయి అతని చేతులు.

భుజాలుపట్టుకుని వూపుతూ "చాక్లెట్లుకదూ? అందామె.

"వుహూ. చెప్పుకోచూదాం."

"ఓ, తెల్సులెండి."

"ఏమిటి?"

"చెప్పేనుకదూ."

"అయితే చూడు నీకు ప్రియమైన..." అతనిచెయ్యి సంపెగలను నలగకుండా ఆమె చేతిలోకి అందించింది. పెదాలు పెదాలను ఆనందంతో కల్సుకున్నాయి. ఒక్కక్షణం...మధుర స్వప్నంలా...! వెంటనే పక్క మీదనుంచి 'కేరు'మని ఏడుపు.

"అబ్బ! వుండండి, ఓనాయనకదూ..మాబంగారుకొండకదూ.... నేను చచ్చిపోయేననుకున్నావా, మానాయనకదూ ..ఓహా, హా....అయా,

అమ్మాయి ఏడుస్తే నీలాలుకారు...పారిజాతగవానాన్నా...." పక్కమీద పడుకుని అటు తిరిగి ఆమె పాలివ్వసాగింది.... కుర్రాడికి.

తిరిగి అన్నది సుమిత్ర "చూడండి ఆ కాళ్ళు, చూడండి ఎట్లా ఆడిస్తున్నాడో, అన్నట్లు అమ్మాయిని సరిగ్గా చూసేరా అసలు? అచ్చుగా మీ పోలికే, కళ్ళు కొంచెం చిన్నవి అనుకోండి. చూడండి.... అమ్మాయి మీకంటె కొంచెం ఎరుపుకదూ...."

అర్థంలేని మాటల ధోరణికి, తనుమాత్రం తల వూపేడు. అత నిదేమీ ఆలోచించటంలేదు. పక్కబట్టల మధ్యపడి నలిగిపోయి నేలకు జారిన సంపెంగలను గురించే అతని ఆలోచనలు!

ఆలోచిస్తున్న అతనికి, వేళ్ళు బిగబట్టి చొంగకారుస్తూ, కాళ్ళూ చేతులూ విసిరే కుర్రాడు తమ మధ్యకు రావడంతోనే జీవితంలో ఒక అధ్యాయం ముగిసిందనిపించింది.

అప్రయత్నంగా అతని కళ్ళు నలిగిపోయిన సంపెంగలమీదకు పోయినవి.

ఏమయి పోయినవి అవ్వి?

"ఏమండీ అమ్మాయిని వోసారి ఎత్తుకోరూ?" అంటూంది సుమిత్ర.

ఇక తనకీ తనప్రేమకీ ఆమెలో స్థానముండదు, ఈ ఆముదం కంపుకొట్టే పసికందుకు ఆమె తన ప్రేమనంతా దోచిపెడుతుంది. కాబోల్ను!

ముందుముందు తను యిక పెందరాళే యింటికి రావలసిన అవ సరం వుండదని గ్రహించిన అతను కుర్రాడిని జాగ్రత్తగా చేతుల్లోకి తీసు కున్నాడు - గాజుసామానులాగ.

'సంపెంగలు' గతించిన స్మృతులు మాత్రమే. అనాదినుండీ!

# కాంతి

కాంతి!

ఇదివరకెన్నడూ ఎరుగనట్లు కన్పించే కాంతి! మెత్తగా సురగ లాగ 'హొరైజన్' నుంచి నేలకు జారిపోయేకాంతి.

సన్నగా ఎక్కడో మూలుగు. ఏమిటా మూలుగు? ఎక్కడ నుంచి?

బాధగా కళ్ళు మూసుకున్నాయి. గుండెల్లో ఏదో చిక్కటి మంట. ఎందుకిట్లా తను బాధపడటం? తను మందు తీసుకుంటే బాగుణ్ను.

మెత్తని బూట్లచప్పుడు. మృదువుగా దగ్గరనుంచే ఎవరో అంటున్నారు 'ఫర్వాలేదమ్మా, అట్లా కన్నీళ్ళు తెచ్చుకుంటే ఎట్లా? గండం గడిచినట్టే, టెంపరేచరు 'నార్మల్'కి వచ్చింది."

కళ్లు తెరిచాడు నెమ్మదిగా అతను. ఎదురుగా లక్ష్మణరావు వున్నాడు. తనింట్లో ఎందుకున్నాడు యితను? మంచంమీదే పడుకొని వున్నాడు. ముఖం పీక్కుపోయింది పాపం, జబ్బుపడ్డాడు కాబోలు.

నర్సు వచ్చి లక్ష్మణరావు మంచందగ్గర నిలబడి అతని టెంపరేచర్ తీసుకుంటూంది అంత నీరసంలోను అందమైన ఆ నర్సును చూడగానే తనలో విపరీతమైన కోరికలు!

డాక్టరువచ్చి 'ఎట్లావుంది మెర్సీ! టెంపరేచరు తగ్గిందా?' అని అడిగేసరికి తాను హాస్పటలులో వున్నట్లు ధృడంగా తెలిసిపోయింది.

అవును తనని హాస్పటలులో పారేసేరు!

ఎదురుగుండా లక్ష్మణరావు దగ్గుతో వుక్కిరి బిక్కిరి అవుతూ 'స్పిట్టూన్' అందక నసుగుతున్నాడు.

చాల ఒంటరిగా, బాధగా ఎట్లాగోవుంది మనస్సంతా. నుదుటి మీద చెయ్యివేసుకు చూసుకున్నాడు. చేతికి నుదురు కాలిపోతున్నట్లనిపిం

చింది. సీత ఏమయ్యింది? మంచందగ్గిరకన్పించడంలేదు. ఒవును, అస్తమా నం కూర్చుంటుంది యిక్కడ, తన బాధ చూస్తూ!

లక్ష్మణరావు భార్య ఎంతో ఆదుర్దాగా 'స్పిట్టూన్' అందుకొని భర్త నోటిదగ్గర ఎత్తి పట్టుకుంది. కళ్ళని అందులో ఉమ్మి, ఒక్క క్షణం ఆయాసంతో కళ్ళు మూసుకుని, లక్ష్మణరావు చెయ్యెత్తి భార్య నెత్తిమీద పక్కటి తగిలించి, 'వుక్కిరి బిక్కిరి అయి చస్తూంటే చూస్తో కూర్చుం టావా లం....' అన్నాడు.

ఆమె కిమ్మనలేదు. ఎంతో ఓర్పుతో కన్నీళ్ళని ఆపుకుంటూ ముందుకి వంగి 'స్పిట్టూన్'ని నేలమీద పెట్టి 'సోడానీళ్ళిమ్మంటారా?' అడిగింది.

లక్ష్మణరావు వగరుస్తూ, వో బూతుపదం ప్రయోగించి, అక్కర లేదని చెప్పి గోడకి జార్లబడి కూర్చున్నాడు.

వెంకటేశ్వర్రావు బాధగా కళ్ళు మూసుకున్నాడు కుమిలి పోయే ఆ యిల్లాలి ముఖం చూడలేక పోతున్నాడతను.

మూసుకున్న కండ్లలోనే 'బ్రూట్' అనుకున్నాడు అతను. బ్రూట్. నిజంగా బ్రూట్! నసిగేడు తను. ఇంట్లో పనులన్నీ చక్కబెట్టుకుని యిక్కడ మళ్ళీ భర్తకి సపర్యలు తక్కువ అవుతాయేమోనని వచ్చిన భార్యని అంత జ్వరంలోను పశువులా నిందిస్తాడూ యీ బోడిభర్త! మళ్ళీ యింట్లోవుంటే భార్య భోజనంచేసిందో లేదో కూడా కనుక్కోరీ గొప్ప భర్తలు!

వెంకటేశ్వర్రావుకి వక్క క్షణం ఆలోచనలు ఆగేయి. వెంటనే అతని మూసుకున్న కండ్ల ఎదుట ఆంబోతు వకటి కన్పించింది. దాని ముఖానికి తన ముఖానికి వున్నట్లు కుడివైపున నుదిటదగ్గిర చిన్న గాయ ముంది. క్రమంగా దానికి తనలాగే కొంగ్రాల క్రాపు వుండటం కన్పిం చింది. నిదానంగా చూస్తే తన ముఖమే దానిది!

భయంతో కండ్లు తెరిచేడు వెంకటేశ్వర్రావు. లక్ష్మణరావు గ్లాసు లోని కాఫీ తాగుతున్నాడు. అతని భార్య పక్కనే నిలబడి చల్లగా విసన కర్రతో నెమ్మదిగా విసురుతోంది.

భగవాడికి వున్నంత కోపం ఆడదానికే వుంటే యిద్దరి బతుకులు ఏమయిపోయేవో! యీ దేవికి కూడా లేని సహనం వీళ్ళకి ఎక్కడనుంచి వస్తుందో!

తనకి నోరెండిపోతున్నట్లుంది. కొంచెం మంచినీళ్ళిస్తే బావుణ్ను ఎవరన్నా! ఈ నర్స్ ఏమయిపోయిందని? తన సీత ఏమయిపోయింది యింతవరకు? తను గొంతు యెండి చచ్చిపోతాడు కాబోల్ను యిలాగే. ఎవర్నీ పిలవడానికి తనకి శక్తికూడా లేకుండా వుంది. ఏమయిపోయింది తన శక్తంతా. ఆ పక్కనుంచి యీ పక్కకి తిరగగలడా తనసలు! నెమ్మదిగా ప్రయత్నించి తిరిగేడు ఎడమ పక్కకి. గుమ్మంలో కూర్చుని వుంది సీత ఏదో పుస్తకంలోని బొమ్మలను చూస్తూ.

అతనికి అంత నీరసంలోను విపరీతమైన కోపమొచ్చింది. తనక్కడ చావడానికి సిద్ధంగావుంటే ఆదేదో పుస్తకం చూసుకుంటుంది! తను చస్తే హాయిగా యింకోడ్ని పెళ్ళి చేసుకుంటుంది కాబోల్ను. చేసుకోనీ, తనిట్లా దిక్కులేని చావు చస్తాడు. ఈ సమయంలో అమ్మవుంటే ఎంతబావుణ్ను. తనకోసం ప్రతి క్షణం గిలగిల లాడిపోదూ? తనెప్పుడు చస్తాడా అని కాబోల్ను ఆ ఆలోచన, ఆ డిగులు, దానికి. తనంత తొరగా చావడులే. డి. యమ్. ఓ. శాస్త్రిగారుండగా తను చావడు.

కండ్లెత్తి తనవైపు చూస్తోంది. తను వింతగా ఏదో సౌంజ్ఞ చేస్తున్నాడు తనకి తెలియకుండానే. ఏదో కరిగి తనలో జారిపోతోంది ఎక్కడికో తన స్పృహతప్పిపోయాన్నట్లుంది.

తనకి మళ్ళీ స్పృహ వచ్చేసరికి తన భార్య విసురుతూ, చమట తుడుస్తూంది ఆదుర్దాగా ఆమె గ్లూకోజుడబ్బా అందుకుని నీళ్ళల్లో కలిపి చంచాతో తన మంచంవద్ద బెరుకుగా నిలబడింది. కండ్లతోనే కూర్చోమన్నట్లు సౌంజ్ఞ చేసేడు అతను

ఆమె మంచం చివరన కూర్చుని చంచాతో గ్లూకోజ్ నీళ్ళు తన నోట్లోకి అందించ సాగింది.

తనిక చావడు. ఆ భయం లేదు ఇక. పూర్వంలా తలలో ఏదో ఎగిరిపోతున్న 'సెన్సేషన్' లేదిప్పుడు.

చేతిని నోటి కడ్డుపెట్టుకుని ఇక చాలన్నట్లు సంజ్ఞ చేసేడతను. సీత నెమ్మదిగా గ్లాసును చిన్న బల్లమీద వుంచి తన ముఖంమీది చెమటను తుడిచి విసరసాగింది.

ఆమె ముఖాన్నే చూస్తూ పడుకున్నాడట్లా తను. కంట్లు రెండూ ఎర్రగాపున్నాయి....సీతకి. నిద్రలేదా లేక ఏడుస్తూందా ?

కండ్లు రెండూ మూసుకున్నాడతను. తేనెటీగలు తుట్టెనుంచి కదిలినట్లు కదుల్తున్నాయి ఎవ్వేవో ఆలోచన్లు. తన శక్తి సగం యీ అర్థంలేని ఆలోచనలతోటి, 'Repressions' తోటి నశించిపోతోంది. అవును తన యీ రోగానికి కారణం కూడా యీ యెడతెగని ఆలోచనలే. మెదడు ఒక్క క్షణం 'Blank' గా స్థిరంగా వుండక పోవడానికి కారణమేమిటో ?

కండ్లు తెరిస్తే విచారంగా తనవంక చూసే సీత ; కండ్లు మూస్తే క్రాఫింగ్ వున్న అంటోతు. అంటోతు తనలాగే వంకరగా నవ్వుతోంది. కొంపతీసి తనే కాదుకదా ఆ అంటోతు ? ఛీ ! ఛీ !

ఆ ఆలోచనని వక్క తన్ను తన్ని వేరే యేదో ఆలోచించ బోయాడు. సీత కిటికీదగ్గర నిలబడి యేడుస్తూన్నట్లు కన్పించింది తనకి. ముఖాన్ని అటు తిప్పుకొని నిలబడివుంది. యెందుకేడుస్తుంది ?

ఎవరో నిలవేసి అడుగుతున్నారు. 'యెవరు బ్రూట్' నేనా? నువ్వా బ్రూటువి! రోజూ ఒంటిగంటకి కొంపకొచ్చే నువ్వా బ్రూటువి. భార్యకి జబ్బుగా వుంచే కొంపనికూడా చూడకుండా హోటల్లో భోజనం చేసిన నువ్వా బ్రూటువి. నేనే బ్రూటునట! ఈ మనిషి చాలా పెద్ద మనిషైనట్లు.

రోజులు నరకంలా గడిచింది. అదెంత బాధపడిందో తానొక్క మాటన్నా మాట్లాడనందుకు; పైగా పక్కింటివాళ్ళు హోమ్యోపతి డాక్టరుని పిలిపించేరని తను మండిపడ్డాడు. ఇంతాచేసి పాపం 10 రూపాయలు కూడా చార్జీ చెయ్యలేదా డాక్టరు.

ఆ 'క్రాపింగ్' అంటోతు తనే! లక్ష్మణరావు కన్న పశువులా హీనంగా ప్రవర్తించేడు తను. ఒక్క క్షణం ఏదో పుస్తకం చూస్తూ కూచుందని అసహ్యంగా అనుకున్నాడు సీతను గురించి తను! పాపం యీ ఆడవాళ్ళకి యీ ఓర్పే లేకపోతే తనవంటి భర్తల గతి యేమయి వుండేదో!

కండ్లు తెరిచేడు వెంకటేశ్వర్రావు. సీత తనవంకే చూస్తూ యింకా అట్లాగే విసురుతూ తనేమైనా అంటాడేమో అన్నట్లు భయంతో 'ఫ్లాస్కులో కాఫీవుంది....యిమ్మంటారా' అడిగింది.

మలినంగా, హీనంగా వచ్చిన చిరునవ్వుతో వెంకటేశ్వర్రావు 'ఊఁ' అన్నాడు.

అట్లాగే పడుకుని వున్న వెంకటేశ్వర్రావు గొంతులో కొత్త చొప్పున కాఫీని పోస్తూ 'యెట్లావుంది?' అడిగింది సీత.

ఫర్వాలే అన్నట్లు తలూపుతూ, చేతిని యిక వద్దని వూపి కండ్లు మూసుకున్నాడు. లోపల్నుంచి పొగలు! విసరమని చెయ్యివూపి, చల్లగా గాలి తగులుతుంటే కండ్లు తెరిచాడు.

సీత విసురుతూ యేమేమో ఆలోచిస్తోంది, తనవైపే చూస్తూ.

అతని హృదయం యేదో ఆనందంతో నిండినట్లయ్యింది. ఏక ఆలోచనతో, నెమ్మదిగా ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకుని 'భోంచేసేవా?' హీనంగా అడిగేడతను.

సీత తల తిప్పుతూ 'ఫర్వాలే, నా భోజనానికేం తొందర లేదిప్పుడు. ఆకలి వెయ్యడం లేదు' అంది బెదురుగానే.

ఉండుండి లక్ష్మణరావు కాటోల్ను అరవసాగేడు. "అవును నేను చస్తా. అదేగా నీ కోరిక. హాయిగా ఆ డాక్టరుతో లేచిపోవుదుగాని. నేనిక్కడ నీరసంతో చూస్తూంటే అటు చూస్తావేసే లం—! నేను చావాలనేనా! ఆస్తంతా నీదే! వాడూ నువ్వూ కల్సి విషంపెట్టేయ్యండి." వెంటనే విపరీతమైన దగ్గు

వెంకటేశ్వర్రావు కండ్లలో సీతకి దివ్యహాస్యం కన్పించిదొకటి. అందులో తనూ ఆయనా కలతల్లేని జీవనం!

సీత కండ్లలో యేం చూశాడో వెంకటేశ్వర్రావు. వెచ్చగా ఆమె చేతిని చిన్న నొక్కుమాత్రం నొక్కాదా మన్పించిం దానికి ఆ ఆనందంలో.

కండ్లు మూసుకున్నా ఆకాశంనుంచి నేలకు మెత్తగా నురగలాగ జారిపోయే వింతకాంతి!

# అడవి

[క్రూర అడవి యిది. ఇందులో ఆకలిగొన్న మృగరాజులున్నాయి. అయినా యిది చాలా విశాలమైన అడవి. అందుకనే, యిందులో గుర్రాలు, గొర్రెలు, ఆవులు, లేళ్ళుకూడా వున్నాయి. కాని....]

లేత కళ్ళతో బెదురు బెదురుగా చూస్తూ "నేనుకూడా ఒక కథ వ్రాస్తున్నాను-మామయ్యా" అన్నాడు విశ్వం.

దిగులేసింది నాకు వాడిని చూస్తూంటే. అందుకనేకాబోలు వాడిలో కన్పిస్తూన్న యీ మార్పంతా.

ఎప్పుడు చూచినా నవ్వుతూండే వాడి ముఖం ఆలోచనతో నిండి మౌనంగావుంది. ఎన్నడూ లేనివిధంగా నిర్లక్ష్యంగా దువ్వబడిన ఆ జుత్తూ, దుస్తులూ, వాడూ....ఎప్పుడూ సొంతంత్రాలప్పుడు ఏబంతో ఆడుకునేవాడు, సావధానంగా యివ్వేళ నాతో మాట్లాడే విధమూ, వాడిలోని మార్పుని స్పష్టంగా పట్టిస్తూంది.

"పూర్తిచేసేసేవా, లేక యింకా రాస్తున్నావా?" ఆదుర్దాగానే అడిగేను.

"రేపు పూర్తయిపోతుంది మామయ్యా."

"నా మాట విని వెంటనే దానిని ముక్కలు ముక్కలుగా చించి పారెయ్యి. ఏదీ వొట్టెయ్యి - యింకెప్పుడూ యిటువంటి పనులు చెయ్యనని."

నన్ను ఎగాదిగా చూడటం యీసారి వాడి వంతు. అర్థముకాక, "ఆదేమిటి మామయ్యా" అన్నాడు వాడు.

"నా మాటమీద నీకు నీసమైనా విలువ వుంటే యింకెప్పుడూ, కథలు వ్రాయడము, గేయాలు అల్లడము యిటువంటి పిచ్చ పిచ్చ పనులేమీ చెయ్యకు. లక్షణంగా చదువుకొని బాగుపడవలసిన కుర్రాడివి."

పరీక్షగా చూసేదు వాదు మళ్ళీ నా ముఖంవంక, వాడి మెదడులో ఎన్నో ఆలోచనలు, సందేహాలు కుప్పిగంతులు వేస్తున్నాయని నాకు తెల్సును. నా మెదడులోనూ మెరపుల్లా మెరసి అదృశ్యమయి పోతు న్నాయి ఎన్నో ఆలోచనలు. అవి రేకెత్తించే స్మృతుల్ని గమనిస్తున్నాను నేను. నన్ను గమనించిన వాడు, యిదే అదననుకొని జారుకున్నాడు.

కొంచెము వోపికపడితే వాడికి నే నెన్నో చెబుదామనుకున్నాను. కాని వాడెందుకు ఆగుతాడూ ?

అవడానికి చాలా దూరపు బంధువు వాడు మాకు. కాని దగ్గర దగ్గర యిళ్ళవటం వలన తరచుగ కలుసుకుంటూండే వాళ్ళము మేము. మా యింటి యజమానితో వచ్చిన పేచీతో కొద్ది దినాల్లోనే నాకూ వాళ్ళ యింటికి మైలున్నర ఎడము ఏర్పడింది.

ఇండ్లకు ఎడము ఏర్పడినా వాడు తరుచు నాకు ఆగుపడుస్తూనే వున్నాడు పత్రికలలో. నిరుత్సాహపరచేనన్నమాటేగాని అద్భుతంగా వ్రాస్తున్నాడు వాడు. ఇదివరకు రచయితల్లో లేని నవ్యత, సహజత్వం ద్యోతకమవుతూంది. వీడి రచనలలో భావాలు చాలా సునిశితంగాను, వ్యంగ్యంగాను వుంటున్నాయి. వాడిని పొగడి సూడుచేయడం యిష్టంలేక వాడు రెండు మూడుసార్లు రోడ్డుపైన తారసిల్లినా తప్పించుకున్నాను.

కాని వూరుకోలేదు వాడు మాత్రం. రోడ్డుకు అడ్డంగా నిలవేసేడు వకరోజున నన్ను. ముఖంమీద కొట్టినట్లు అడిగేడు తన రచనలు ఎట్లా వుంటున్నాయని. బాగానే వుంటున్నాయన్నాను. వాడిని మళ్ళీ రచనల విషయం ఎత్తనీయకుండా, "పరీక్షలకు బాగా చదువుతున్నావా?" అని అడిగేను. తల వూపాడు. "బి. ఏ. అయ్యేక ఏం చేస్తావు" అన్నాను వెంటనే "ఏమో" అన్నాడు వాడు. లేచిలాగ బెదురు బెదురుగా చూస్తూ, "అయితే మాసయ్యాం పత్రికలవాళ్ళు రచన వేసుకుని, కాపీ అయినా పంపించరేమిటి" అన్నాడు.

అదంతా రామాయణమంత గ్రంథం వుంది. ఎట్లా చెప్పను వీడికి! ఇదంతా నీకూ జరిగిందా అని నా ముఖం మీదనే అడిగెయ్యడూ వీడు? ఆలోచిస్తున్నాను.

అడిగేను విశ్వంను "ఒరేయి నువు కళకోసం వ్రాస్తున్నావా, కాసు కోసం వ్రాస్తున్నావా?" అని.

"సరదాగా వ్రాస్తున్నాను, దానిని నువ్వు కళ అను, మరేమయినా అను" అన్నాడు వాడు.

"బావుందయితే. సరదాగా వ్రాసేవాడవు, సరదాగా వో కాపీ కొనుక్కోలేవురా?"

అమాయకంగ నవ్వేడు వాడు.

"ఇట్లాగ సరదాకోసం వ్రాయగలిగితేనే ముందుకూడా వ్రాయడం సాగించు. లేకపోతే చాలా బాధపడతావు."

"అదేమిటి మామయ్యా?"

"అంతే అది. నువ్వు సుఖాన వుండక రొచ్చులో కాలు పెడుతున్నావు— జాగ్రత్త."

వాడు వెళ్ళిపోతున్నాడు నెమ్మదిగా,

రెండేళ్ళ తరువాత కాటోలుకు! మళ్ళీ వాడిని కలుసుకొనడం సంభవించింది. అప్పటికి బ్యాంకిలో వుద్యోగం చేస్తున్నాడు వాడు. డబ్బయి రూపాయలు సంపాదిస్తున్నాడు. వాడు బి. ఎ. ప్యాసయ్యేడు.

కుశలప్రశ్నలు, సమాధానాలు అయ్యేక వాడు చెప్పేడు- తనకు లేఖలు వ్రాసి కథలు తెప్పించుకొని ప్రచురించుకుంటున్నారుట సంపాదకులు.

"సెభాష్" అన్నాడు.

"ప్రచురించబడిన రచనలకు పారితోషికం యిస్తామనికూడా వాళ్లు పత్రికలలో చెప్పుతున్నారు" అన్నాడు.

"బాగుంది."

"బ్యాంకువాళ్ళిచ్చే జీతం చాలకపోగా నెలకు పాతికవరకు అప్పు చెయ్యవలసి వస్తోంది."

"ఎట్లాగో సరిపెట్టుకోవాలి సంసారాన్ని మరి."

"సంసారం సరిపెట్టుతున్నాను మామయ్యా. దినదినానికి దేశంలోకి అనేక అమూల్య గ్రంథాలొచ్చి పడుతున్నాయి. అవి చదవాలని వుంటుంది" అన్నాడు.

"మరేమీ బాధలేదు— మానెయ్యి."

"ఉజ్వలభావాలను వెదజల్లే రష్యన్, ఇటాలియన్ చిత్రాలు వస్తున్నాయి. అవి చూడొద్దూ?" జాలిగా అడిగేడు.

"నువ్వు చూడకపోతే, ప్రపంచం మునిగిపోదు."

"ఇస్తానన్న వాళ్ళయినా ప్రచురించుకున్న రచనలకు డబ్బిస్తే-" ఏదో చెప్పబోతున్నాడు వాడు.

"ఏడవకపోయేవు" అని బయటకు వచ్చిపడ్డాను. రచయితలంతా రావలసిన సుడిగుండంలోకి వస్తున్నాడు వీడూను!

ఆరు నెలల తర్వాత అగుపించేడు విశ్వం మళ్ళీ. ఐస్ పార్లర్ ముందు నిలబడి, తనవంకే చూస్తూ, ఏదో ఆలోచిస్తున్నాడు. బహుశా తనను పలకరిద్దామా, వద్దా అని కాబోలును.

"ఏరా విశ్వం, ఎట్లా వున్నావు?" అన్నాను నేనే.

"బాగానే వున్నాను మామయ్యా" అన్నాడు.

"ఎట్లావుంది నీ కళ" అడిగేను.

ఈ ప్రశ్నకోసమే ఎదురు చూస్తున్నవాడివలె వెంటనే అన్నాడు వాడు, "ఈ వూరిలో వకాయన నా కథలు పుస్తకరూపంలో వేస్తానంటున్నాడు మామయ్యా. నీ సలహా అడిగి-"

"పేరేమిటి అన్నావు?"

"శ్రీరామ లక్ష్మయ్య."

"నామాట వింటావా- చెబుతాను."

"చెప్పు మామయ్యా."

"వాడికేకాదు- ఎవ్వరికీ యియ్యకు. ముఖ్యంగా వాడికి అసలు యివ్వకు. నీ స్వంత ఖర్చులతో ఏనాడైనా అచ్చు వేయించుకో గల్గితే వేయించుకో, అంతే."

"ఆయన చాలా మర్యాదస్తుడు మామయ్యా "

"ఎవరు కారు?"

"చాలా నమ్మకంగాను, గౌరవంగాను అప్పచెప్తాడు."

"ఏమంటావు అయితే,"

"ఇంత నమ్మకంగా మాట్లాడే మానవుడు తోటి మానవుడిని చూస్తూచూస్తూ మోస చేస్తాడా మామయ్యా."

"మానవుడిని మోసగించక, జంతువుల్ని మోసగిస్తాడా? ఆయనతోమాత్రం వ్యవహారాలు పెట్టుకోక. వృథా ప్రయాస పడరాపు "

"అదేమిటి మామయ్యా- ఆయన చాలా పెద్దమనిషి-"

వాడికి మానవుడిమీద అనంతమైన విశ్వాసం. అనిర్వచనీయమైన ప్రేమ. మానవుడిని మానవుడు హింసించగలడనిగాని, మోసగించగలడనిగాని నమ్మడు వాడు. మోసం యెరగని వీడు రచయిత ఎందుకు అయ్యేడో తెలియదు తనకు.

"నీయిష్టం." వెళ్ళిపోయేను నేను.

మళ్ళీ నేను వాడిని, ఆరు నెలలతర్వాత వాడి యింట్లో కల్సుకున్నాను, వాడికి జబ్బుగా వుందని విని చూడటానికి వెళ్లేను. నేను వెళ్ళేసరికి మంచంమీద పడుకుని దగ్గుతూనే, వాడేదో పుస్తకము చదువుతున్నాడు.

చెప్పుల చప్పుడుకు పుస్తకాన్ని దించి, "రామామయ్యా"అన్నాడు హీనస్వరంలో.

మనిషి చిక్కి శల్యమై వున్నాడు. దీనికితోడు అపరిమితమైన కళ్ళతోకూడిన దగ్గు.

"ఎన్నాళ్ళనుంచి యీజ్వరం" అడిగేను.

"నెల దినాలయ్యిందిరా బాబూ! ఇంత జబ్బులోనూ ఆ పాడు పుస్తకాలను వదలమంటే వదలడు. ఒకటే చదువు. ఒకటే రాత! ప్రాణంతీయటానికే వొచ్చింది చదువు." అంటూవచ్చింది వంటింట్లోంచి ముసలమ్మ.

"అదే తగ్గిపోతుందిలే అక్కయ్యా.... నువ్వు నీపని చూసుకో" అన్నాను ముసలమ్మ సణుగుకుంటూ వెళ్ళిపోయింది లోపలకు.

"ఏమిటోయి జ్వరంలోకూడా చదువేమిటి.... పూర్తిగా విశ్రాంతి తీసుకోక, డాక్టర్ ఎవ్వరు?"

"గోవిందరావుగారులే. అన్నట్లు నా కథలపుస్తకం అచ్చయ్యింది చూసేవా మామయ్యా.... ఆ అలమారులో వుంది చూడు.... చాలా మంచి 'రివ్యూస్' వచ్చేయి."

కుతూహలంగా చూచేను. మంచి 'రివ్యూస్' వుండటం చూచేను హక్కులన్నీ పబ్లిషర్సువి అనికూడా వుండటంచూచేను.

"ఎంత యిచ్చేరురా, అబ్బీ!" అడిగేను.

"డబ్బుకు యిబ్బందిగా వుందిట, త్వరలోనే యిస్తానన్నాడు."

"హుఁ.... అదే.... ఎంతని?"

"అరవయి"

"వెయ్యి కాపీలకేనా."

"అవును."

"హక్కులన్నీ అతను తీసుకునా?"

"హక్కుల సంగతి నాదే తప్పు మామయ్యా, నే నేమీ ముందు మాట్లాడలేదు."

"మాట్లాడకపోతే మాత్రం, బోడి అరవయి రూపాయిలిచ్చి హక్కులన్నీ తీసుకుంటాడట్రా వాడు ?"

"ఆయనట్లా తీసుకునే రకం కాదు గాని ఏదో పొరపాటై వుండొచ్చు....ఎట్లావుంది ముద్రణ ?" అన్నాడు దగ్గుతో ఉక్కిరి బిక్కిరి అవుతూ.

"బాగానే వుంది. అయితే ఆ అరవయి అయినా యివ్వలేదు యింతవరకు ?"

"ఇస్తాడు పాపం ! ఆ మధ్య అడిగితే, అప్పుడే పండగవచ్చింది. భార్యకు నెక్లేసు చేయిస్తానని వాగ్దానం చేసేడుట. తర్వాత పాపం పేపరు కొనాల్సి వచ్చిందిట. బోలెడు డబ్బెట్టి బ్లాకులో."

"అయినదేదో అయ్యింది గాని, ఇంక వాడితో వ్యవహారా లేమీ పెట్టుకోక."

"నేనంటే చాలా అభిమానం మామయ్యా ఆయనకు. ఆమధ్య 'జంగిల్' అనే వక రచన మరెవ్వరికీ యివ్వక నాకే యిచ్చేడు అనువదించమని. నా శైలి చాలా బాగుంటుందని మెచ్చుకున్నాడు ఎన్నోసార్లు."

"ఊః! ఒప్పుకోలేదుకదా నువ్వు."

"ఒప్పుకున్నాను, రెండువందల రూపాయలు యిస్తానన్నాడు మామయ్యా....రెండువందలు. దాంతో ఎన్నో ప్రఖ్యాత గ్రంథాలు కొనుక్కోవచ్చును."

"మూలం ఎన్ని పేజీలుంది ?"

"మూడువందల యెనభయి."

"హుం. తర్వాత ?"

"వంద పేజీలు చెయ్యగానే, కథల తాలూకు అరవయి రూపాయలు దాని తాలూకు బజానా వంద, రెండు కలిపి యిచ్చేస్తానని వాగ్దానం చేసేడు."

"పూరి చేసెయ్యక పోయేవు .... మందులకన్నా పనికివచ్చేది?" వ్యంగ్యంగా అన్నాను.

"చేసేను."

"ఈ రోగంతో కూర్చుని వ్రాస్తున్నావా?" తల వంచుకున్నాడు వాడు.

"ఇచ్చేడా మూట అరవై రూపాయలు."

"ఉత్తరం వ్రాసేసు పెళ్ళలేక."

"ఒచ్చేడా యిక్కడికి?"

"ఊళ్ళో లేనట్లున్నాడు, సమాధానం లేదు,"

"మళ్ళీ వ్రాయకపోయేవు?"

"వ్రాసేను."

"ఇట్లా జబ్బుగావుంది, అవస్థపడుతున్నానని వ్రాసేవా?"

"వ్రాసేను."

"ఏమన్నాడు మరి."

"మీ రుణం వుంచుకోను. ఎట్లాగో వకలాగ పది దినాల్లో పంపుతున్నా నన్నాడు. అర్జంటుగా పిల్లలను బెంగుళూర్ తీసుకెళ్లు తున్నానన్నాడు."

"ఎన్నాళ్ళయ్యింది యిది వ్రాసి?"

"పన్నెండు రోజులు."

"ఇంతవరకు ఏమీలేదూ?" అడిగేను,

"పాపం, ఆయనకెంత యిబ్బందిగావుందో....తొందరపెడితే ఎట్లా మామయ్యా. ఎల్లాగో వకలాగ దీన్ని పూర్తిచేస్తా యీ రోగం కాస్త తగ్గితే. ఈ గ్రంథంతో నా పేరు దిగంతాల వ్యాపిస్తుంది మామయ్యా. ఎటువంటి అమూల్య భావాలు వున్నాయి యిందులో!"వాడి కళ్లు మెరుస్తున్నయి.

"ఆ చదివేది ఆదేనా...."

"ఆదేమాషయ్యా....జంగిల్...."

"సీక్రర్మ...."లేచేను. మందులకు వాడమని పది యాభయి మున అమ్మ చేతిలో వుంచి బయటకు వచ్చేసేను.

మరునాడు శ్రీరామలక్ష్మయ్యా రోడ్డుపైన అపుపించేడు. చిరునవ్వు నవ్వుతున్నాడు. విశ్వం అవస్థచెప్పి ఏమైనా పైకం వుంటే పంపి సాయం చెయ్యమన్నాను. చిరునవ్వుతోనే అన్నాడు ఆయన - "అరే-యిప్పుడే డ్రెస్సుకొనడానికి వున్నదంతా యిచ్చేసేనండీ."

ఆ వారంలోనే విశ్వం యీ విశ్వాన్ని వదలి వెళ్ళిపోయేడు.

వాడిపేరు దిగంతాల వ్యాపించడానికి కొన్ని యుగాలు పట్టవచ్చును. కాని యీలోగా శ్రీరామ లక్ష్మయ్యలు మాత్రము మేడలు కట్టుకోవచ్చును. నెక్లేసులు చేయింపుకోవచ్చును, డ్రెస్సులు కొనుక్కో-వచ్చును.

[ఒకే అడవియిది. ఇందులో ఆకలిగొన్న మృగరాజులున్నాయి.]

# సరిపడని సత్యం

చిత్రవిచిత్రగతుల్లో గంతులువేస్తున్న మనస్సును "ఊరుకో వాయి పిచ్చిపుల్లాయి" అని మందలించుకున్నాడు సత్యనారాయణ.

అతని మనస్సు వక్క మూలుగు మూలిగి క్షణంపాటు వూరు కుంది పార్కులో అతనితోబాటు పచ్చటిగడ్డిపై కూర్చున్న అతని మిత్రులు మాట్లాడుతూన్నారు సిగరెట్ పొగల మధ్యను

"నాకు మద్రాసులో యింజనీరింగు చదవాలని వుందోయి, కాని నాన్నగా రేమంటారో ?" అంటున్నాడు చంద్రం.

"నీకేమోయి ఎక్కడైనా చదువుతావు. అవన్నీ భట్టీవేసేపు-ప్యాస వుతాననే ధీమా, మన సంగతి మళ్ళీ సెప్టెంబర్‌కి కూర్చునేట్లుంది." అన్నాడు సుబ్బారావు....గడ్డిపరకలని కసిగా లాగుతూ.

"నువ్వేం విచారించకురా - నేనూ వున్నా నీకు సాయం: కాని మా 'ఫాదర్' ఇక యీ సారికూడా పోతే "చాల్లే యీ చదువు....పొలా నికి నడు అంటారు" అంటున్నాడు రంగారెడ్డి.

"ఆదర్శవంతమైన జీవితానికి బాటలు దిద్దుతూ కథలు వ్రాయి. గేయాలు అల్లు. జీవితాన్ని వక కళగా చేసుకో. ఇన్నాళ్ళూ కళారాధకుడి వంటూ వువ్విళ్ళూరి చప్పబడటం కాదు....యింకేమేమో చెప్పబోతూంది అతనిమనస్సు.

"నోర్మూయ్యి" గట్టిగా కోప్పడ్డాడు లోలోపలే మనస్సు నాతను.

"పాపం వెంకటేశయ్యర్ ఎంత వోపిగ్గా చెప్పేవాడోయి ఫిలాసఫీ అంటున్నాడు సుబ్బారావు.

"వేరు సెనగలు - బటానీలు," అరుస్తున్నాడో కుర్రాడు తమ ముందు నుంచే దాటిపోతూ, ఆశగా తమవంక చూస్తూ.

"అయ్యా! బీద కుర్రాడినండి. తలిదండ్రులు చిన్నతనంలోనే చనిపోయేరు. మునిసిపల్‌స్కూల్లో నాల్గో ఫారం చదువుతున్నాను. కనికరించి పుస్తకాల కేమైనా సాయం...." అంటూ దూరంగా కూర్చుని వున్న కొందరు విద్యార్థులవద్ద వక కుర్రాడు దీనంగా యాచిస్తున్నాడు.

"దేశంలో పేదవారికి విద్యా, వసతి, తిండి లేనంతకాలం దేశం దేశమేకాదు. చదువుకోడానికిగూడా ఆ బాలుడు యాచిస్తున్నాడంటే మన దేశం ఎంత వున్నతస్థితిలో వుందో చూడవచ్చును. తను రాజకీయాల్లో కలుగజేసుకొని గొప్ప నాయకుడై వీళ్ళందర్నీ వుద్ధరించడం తన ధర్మం గాదూ?"

వెంటనే, ప్రస్తుతం తన దేశానికున్న వివిధ రాజకీయ నాయకులు గుర్తుకొచ్చారు. ఒక సమస్య సందర్భంలో యీ నాయకులంతా ఎంత మూర్ఖంగా, అవసవ్యంగా వ్యవహరించిందీ కూడా జ్ఞప్తికొచ్చింది. వీరంతా ముందు సదాశయాలతోటే కదా రాజకీయాలలోకి అడుగు పెట్టింది? తర్వాత తర్వాత కదా స్వార్థం అనేది అడ్డొచ్చిపడత!

"కాని నీ సంగతి—"

"ఛవ్!" గట్టిగా అన్నాడు సత్యన్నారాయణ.

"ఏమిట్రా అది" రంగారెడ్డి ప్రశ్నించేడు నోట్లోని పచ్చగడ్డి పరకను వుమ్మేసి,

లజ్జపడుతూ "ఏమీలేదు"అని చుట్టూరా చూసేడు సత్యనారాయణ. యాచకబాలుడు తమవైపుకే వస్తున్నాడు. సత్యనారాయణ లేచి నిలబడ్డాడు, ఖాళీ జేబులు గుర్తుకొచ్చి.

"వెళ్లొస్తానోయి....కొంచెం పనుంది" ఖాళీలాగూ జేబుల్లో చేతులుపెట్టుకొని సత్యంపార్కునుంచి యింటికి త్రోవతీసేడు.

* * *

యూనివర్సిటీ పరీక్షలవగానే సత్యానికి పెద్దబరువు తలమీదనుంచి దించబడినంత హాయిగా వుంది. ఇక తను ఎంత నిద్రపోయినా అడిగే వారుండరనే తలంపు చాలా ఆనందాన్నిచ్చింది అతనికి.

"దిక్కులేని ఆడదాన్ని ఈ పసిపిల్లల్ని పెట్టుకొని ఇన్నాళ్ళు ఎన్ని కష్టాలు పడ్డానో ఆ భగవంతుడికే తెలియాలి. యిక మీకు రెక్కలొచ్చేయి, మీ బ్రతుకు మీరు బ్రతకగలరు."

"తమ నెప్పుడూ పసిపిల్లలు" అంటుంది అనుకుంటూనే సత్యం అన్నాడు "అదేమిటమ్మా కష్టాలు పడ్డాము; అయిపోయేయి. వచ్చేవన్నీ మంచి రోజులే అమ్మా, అయినా నేనెక్కడికి ఎగిరిపోతానమ్మా ఎంత పెద్ద రెక్కలున్నా."

"ఏదో కష్టపడి చదివినందుకు ఫలితం దక్కింది అంతే చాలు, వస్తానుండు లోపల కూరగిన్నె ఏమయ్యిందో." అంటూనే వెళ్ళి పోయింది లోపలికి సత్యం తల్లి.

"తల్లి! ఎంత తియ్యటి పదం! ఎంత విశాల హృదయం! ఎంత చల్లటి చూపులు."

ఆకస్మికంగా అమ్మ కట్టుకున్న చీరె పాచాల వద్దా, వీపుమీద చిరిగిపోయి వుండటం సత్యానికి గుర్తుకొచ్చింది.

"యికనుంచి నువ్వి చిరిగిన చీరెలు కట్టడం నేను భరించలే నమ్మా! నే నుద్యోగం చేస్తాను. సంపాదించి నీకిస్తా." అనుకున్నాడు సత్యం లోలోపలే.

అమ్మకి యీమాట చెబితే ఎంత సంతోషిస్తుందో; దైన్యరేఖలు ఆవరించిన అమ్మ ముఖం అతని స్మృతిలోంచి అంతర్ధానమైనది. చిర్న వ్వుతో తొణికిసలాడే అమ్మముఖం అతనిమనస్సులో చిత్రితమయ్యింది. ముందు వరండాలోకి నడుస్తూండగా "కలెక్టర్, తాసీల్దార్, సూప ర్నెంటు" అనేపదాలు గింగురు మన్నాయి. నవ్వేసి, "అన్నయ్యా నాకిక ఎక్కడైనా ఉద్యోగం చెయ్యాలని వుంది అన్నయ్యా" అన్నాడు సత్యం ఎక్కడికో చూస్తూ.

పేపరు చదువుతూన్న అన్న వక్క క్షణం ఆగి, పేపరును క్రిందకుదించి, "ఉద్యోగం? రైట్-రేపే మా ఆఫీసరుతో మాట్లాడుతాను" అన్నాడు.

"అదికాదన్నయ్యా! ఈ వూళ్ళో అయితేనే అమ్మకి ఆసరాగానూ, తమ్ముడికి ధైర్యంగానూ వుంటుందనుకుంటా. బెజవాడలో అయితే చూడు, ఎంతిచ్చినా చాలదు.... బోలెడు ఖర్చు!"

" రైట్! సాయంత్రమే మా ఫ్రండ్సుతో చెప్పేసి వెడతాను. వాళ్ళే ఏదో వుద్యోగమిస్తారు. అమ్మతో చెప్పేదా? ఆవిడ ఆనందం చెప్పలేమిక....లోపలికి వెళ్ళి చెప్పు...."తిరిగి పేపరు చదువుకో సాగాడు సత్యం అన్న విశ్వనాథం.

ఆదివారం—ఆదివారం విశ్వనాథం వస్తూనే వున్నాడు, వెడుతూనే వున్నాడు. "ఏమన్నార్రా వెధవలు. ఆ సుందరంగాడ్ని కలుసుకున్నావా, ఏమంటాడు....వేకెన్సీ రాగానే చెబుతాడా....వీడి తల .... వీడు చెప్పే దేమిటి....ఎప్పుడూ వాడు చాలా "బిజీ"గా వుంటాడులే....వాడితో కుదరదు! తాసీల్దారు రాజారావును కలుసుకో, నేను చెప్పేనని చెప్పు .... వెంటనే ఆర్డరువేసి జాయిను అవమంటాడు...." అంటాడు ఎప్పుడైనా ....గుర్తొస్తే. లేకపోతే ఏమీ సంబంధం లేనట్లు పూరుకుంటాడు.

సత్యానికి నిత్యమూ వాళ్ళ చుట్టూరా, వీళ్ళ చుట్టూరా తిరిగి, యిళ్ళవద్ద కాపలాలు కాయడం చాలా నీచమనిపించింది పదిసార్లు అడిగించుకోవడం, మరో అన్నిసార్లు తప్పించుకోవడం కొందరికి సరదా అనే విషయం కూడా యీ పదిహేను రోజుల్లోనూ బాగా అరిగిన సత్యం గ్రహించాడు. ఇక యిట్లా కాదనుకొని ఖాళీ వున్నాయని తెల్సిన ఆఫీసులకల్లా వక అప్లికేషను పడవేశాడు పది అప్లికేషన్లు పడవేస్తే రెండు చోట్లనుంచి మాత్రం పది దినాల తర్వాత జవాబొచ్చింది - యింటర్వ్యూకి రమ్మని.

ఈ టెంపరరీ వుద్యోగానికి కూడా ఇంటర్వ్యూలా అనుకుంటూ వెళ్ళాడు సత్యం.

వాళ్ళు అతనిని ఎగాదిగా చూస్తూ "ఏకులం?" అన్నారు.

"బ్రాహ్మణులం సార్"

రెండో ప్రశ్న లేకుండానే "సారీ" అన్నారు యిద్దరూను.

సత్యానికి వొక పేపరులో యీ "సెక్యులర్ స్టేట్"లో అన్ని మతాలవారినీ సమంగా, నిష్పక్షపాతంగా చూస్తామనే విషయం రాజ్యాంగంలో వొక "క్లాజని" ఎక్కడో చదివినట్లు గుర్తు ; మరి యిదేమిటో అతనికి అంతుబట్టలేదు.

ఇట్లావుండగా అతనికో మిత్రుడు సలహాయిచ్చేడు. "ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి''లో నీ పేరును రిజిస్టరు చేయించుకోవోయి ; మధ్య మధ్య రిమైండ్ చేయిస్తూండు. హెడ్డు గుమాస్తాగారిని కాస్త మంచిచేసుకుంటే త్వరలో వస్తుంది'' అని—

"అట్లాగే సత్యం ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజికి వెళ్ళేడు ఆ మర్నాడు, ఎంతో మంచిగా వినయంగా హెడ్డు గుమాస్తా గారికి అన్నీ మనవి చేసుకున్నాడు. ఆయన చిరునవ్వుతో కొన్నివిషయాలు అడిగి వొక కార్డును పూర్తిచేసి, ఆఫీసరు సంతకం చేయించి సత్యం చేతికిచ్చి, వుద్యోగం రాగానే మీకు కబురు పంపిస్తాం అని చెప్పి పంపేసేడు.

ఊళ్లో అనేక ఖాళీలు వచ్చేయి. పూర్తయిపోయేయి గాని తనకు యెంత కాలానికీ ఏమీ జవాబురాలేదు. సత్యం ఊరికే వుండడమెందుకని పత్రికల్లోని—ఎడ్వర్టయిజ్‌మెంట్ల కాలంలో వెదుకసాగేడు. అందులోనూ 15 వుద్యోగాలుంటే 10 షెడ్యూల్డు తరగతులకు, 4 కాందిశీకులకు, 1 ఆంగ్లో ఇండియన్‌కి. సత్యానికి ఏం చెయ్యాలో అర్థము అవకపోగా ఏం చెయ్యకూడదో కూడా తెలియలేదు.

ఒకనాడు జిల్లా జడ్జీగారు బజారులో తమ కారునాపి ఎవరితోనో వస్తాగా మాట్లాడుతూన్నారు. సత్యం మాసిపోయిన దుస్తులతోనే "అభివందనం'' చేసి ఎడంగా నిలబడ్డాడు. మాట్లాడే పెద్దమనిషి సత్యాన్ని వొక పర్యాయం చుర చుర చూసి, జడ్జీగారివద్ద సెలవు తీసుకొని వెళ్ళిపోయేడు. "ఏం కావాలి అబ్బాయి.'' అన్నారాయన చిత్రంగా సత్యం వైపే చూస్తూ.

)

"నేను గ్రాడ్యుయేటునంటి. యెక్కడా ఉద్యోగం దొరక్క తపర్ని అర్థిస్తున్నా."

"ఇదా సమయం! రేపుదయం ఆఫీసులో తిన్నగా నా ఛాంబర్స్ లోకి అప్లికేషను తీసుకురా."

మర్నాడు వుదయమే సత్యం వెళ్ళి తిన్నగా జడ్జీగారిని కలుసుకు న్నాడు. సెలవు ఖాళీ ఒకటి వుండటంవలన సత్యాన్ని వెంటనే "కాపీయిస్టు" గా నియమించేరు. సత్యం ఏనుగెక్కినట్టయి వక్క వుదుటునవచ్చి తల్లిని కౌగలించుకున్నాడు.

కాపీయిస్టు వుద్యోగం గొప్పది కాకపోయినా బాధాకరమైనదేమీ కాదు. పెష్కారు సూపరింటెండెంటు ఏవో కాగితాలు ముందు పడవేసే వాడు పైపు చెయ్యమని. తను పైపు చేసేవాడు. మరికొన్ని తెలుగులో చేతితో వ్రాయవలసి వచ్చేది, అవీ వ్రాసేవాడు. అవన్నీ కంపేర్ చేసు కొని "పెష్కారు హెడ్"కి యిచ్చేసరికి అయిపొయ్యేది. నెలమొత్తంమీద తను పూర్తిచేసిన కాగితాల పరిమితినిబట్టి వుంటుందట తనజీతం. ఎంత లేదన్నా డబ్బయి రూపాయలన్నా వస్తాయట! ఏదో వొకటిలే అనుకుని సంతృప్తపడి, రోజులు దొర్లించసాగేడు సత్యం.

ఒకనాడు ఆఫీసుకి వెళ్ళగానే లక్ష్మణరావు - తనతోటి కాపీయిస్టు - అడిగేడు "ఏమండోయి ... చూసేరా?" అన్నాడు.

"ఏమిటది?"

"నిన్నటి హిందూ చూడలేదూ? సర్వీసు కమీషను ప్రకటన పడింది"

"లేదే?"

"భలేవారే. వెంటనే అప్లికేషన్ఫారం తెప్పించి పడెయ్యండి. అదృష్టం బాగుంటే తగుల్తుంది."

సర్వీసు కమీషను పరీక్షకి కూర్చున్న తరువాత వారంలోనే సత్యం వుద్యోగం అయిపోయింది. జీతం లెక్కచూపి 76 రూపాయలు

చేతిలో పడేసేడు. గంతులేసే హృదయంతో జీతాన్నంతా తీసుకెళ్ళి తల్లిచేతిలో పెట్టేడు సత్యం.

"అదేమిట్రా యిదంతా నాకెందుకు? నీకు కావలసిందేదో నువ్వు తీసుకో బాబూ" అన్నది తల్లి.

"నాకో ఆరురూపాయలు చాలులే అమ్మా!" అంటూ ఆరు రూపాయలు మాత్రం తీసుకున్నాడు సత్యం. తల్లికళ్ళు ఆనందబాష్పాలతో నిండిపోయేయి. మళ్ళీ ఏదైనా టెంపరరీ వుద్యోగం దొరికితే బాగుండు ననుకుంటూ సత్యం పార్కువైపుకు వెళ్ళిపోయేడు.

రెండునెలల తర్వాత సర్వీసు కమీషనులో సెలక్టు అయినట్టు ఉత్తరం వచ్చింది. అందులో, వెంటనే తాలూకాఫీసులో చేరవలసిందని కూడా వుత్తరువు వుంది. సత్యం ఏమాత్రం ఆలోచించకుండా, వెంటనే ఆ వుద్యోగంలో చేరేడు.

ఆంధ్రదేశం తుఫానులో వూడ్చుకుపోయిన దినాలవి! క్రొత్తగా "లోన్" సెక్షను వొకటి ఏర్పరచేరు. ఒక ప్రత్యేక తాసీల్దారునుకూడా యీ పనికి నియమించేరు. అందులో పనిచెయ్యమన్నారు సత్యాన్ని తాసీల్దారుగారు.

తుఫాన్ బాధితులకు అప్పులివ్వడం ఆ బ్రాంచిపని. తుఫాన్ వల్ల పొలాలు గాని, యిండ్లు గాని నాశనమయిపోయినా, నష్టపోయినా ప్రభుత్వం కొంత సెక్యూరిటీ మీద ఋణమిచ్చి ఆ ఋణాన్ని వాయిదాలద్వారా రాబట్టుకుంటుంది. సత్యం అటువంటి అప్లికేషనులన్నీ సరిగా వున్నాయో లేవో చూచి, నమోదు చేసుకొని తాసీల్దారుగారిముందు వుంచడం, వారు వాటిని పరిశీలించి, రెవిన్యూ యినస్పెక్టరుకు విచారణార్థం వాటి నివ్వడం, రివెన్యూ యినెస్పెక్టరు అప్లికేషనులోని విషయాలన్నీ తాను విచారించేనని అవి నిజమని వ్రాస్తే, తాసీల్దారుగారు ఋణం మంజూరు చేస్తారు. 100 రూపాయలనుంచి 2000 ల వరకు అటువంటి ఋణాలుంటాయి.

ఈ వుద్యోగంలో సత్యం తన తెలివి తేటలను చూపించ వలసిన అవసరం లేకపోయింది. అట్టే యిబ్బంది లేని వుద్యోగం కదా అని మొదట్లో సంతృప్తి పడ్డాడు. అతనికి తనవద్ద వున్న అప్లికేషను నమోదు చేసుకొని తాసీల్దారు గారికి పంపడం, శాన్‌క్షన్ అయ్యేక బాండు వ్రాసి పార్టీలచేతికి చెక్కు యివ్వడం తప్ప వేరే పని లేకపోవ డం వల్ల చేతినిండా పనికూడా వుండేదికాదు. తాసీల్దారుగారు మంచి వారవటం వల్ల పెత్తనం చలాయించేవాడు కాదు· అసలు ఎప్పుడూ తన గదిలోకే వచ్చేవాడు కాదాయన.

నెల తిరగకుండానే యీ తాసీల్దారు గారికి బదిలీ అయ్యింది కొత్తాయన వచ్చేడు.

ఈయన వచ్చేక సత్యం కొంచెం ఇరుకునపడ్డట్టు బాధపడసాగేడు· ఈయన గంటగంటకీవచ్చి గుమాస్తాలు పనిచేస్తున్నారో లేదో చూస్తాడు· ఎక్కడైనా పొరపాటు జరిగితే వూరికే కంఠశోషపెట్టుకొని చిందులు త్రొక్కుతాడు. జమాన్లని ఆఫీసులో పని చెయ్యనివ్వకుండా యింట్లోపని చేయిస్తూంటాడు ఆదివారాలుకూడా ఆఫీసుకు రమ్మంటాడు. అయినా సత్యం విసుక్కోకుండా అట్లాగే సర్దుకొని పోసాగేడు.

* * *

ఆనాడు తాసీల్దారుగారు ఆఫీసుకింకా రాలేదు. పన్నెండున్న రవు తోంది. సత్యం లేచి వరండాలోకి వచ్చి సిగరెట్ కాల్చుకోసాగేడు.

"దణ్ణాలు—బాబయ్య"

తలెత్తి చూసేడు సత్యం—ఆలోచనలలోంచి బయటకొచ్చి తల పాగాతో, బుర్రమీసాల్తో, వకరైతు రెండు చేతులూ ఎత్తి సవినయంగా నమస్కరించేడు—చంకలో కట్టతో.

"ఏం సుబ్బరాజుగారూ మీదింకా తేలలేదూ!"అన్నాడు సత్యం.

"ఎట్టా తేలుద్దండీ బాబయ్యా, కాలికేత్తే మెడకి, మెడకేత్తే కాలికి ఏస్తూంటే."

"రెవిన్యూ యినెస్పెక్టరుగారిచేత రాయించేవా?"

"కరణంగారి చేత రాయించేసరికి, మునిసేబుగారిచేత రాయించే నండి, యినసపెట్టర్‌గోరే బాబు ఎవ్వారం తేలనీకుండా వుండారు"

"అదేమిటండి—మీరు బీదవాళ్ళనీ - అవస్థల్లో వున్నారనీ నేను చెప్పేనుకూడాగా."

"మారాజులు మీరయితే కనికరించి చెప్పేరుగాని, ఆరు పని జరగవద్దుటండీ "నెమ్మదిగా వంగి"పది రూపాయలు తీవారు రమ్మన్నా రుండీ - సరే నన్నాను అక్కడికీ మొన్న ఎట్టాగో అవత్తలుపడి తెచ్చి ముట్ట చెప్పేనుండీ - యిద్యేళ రాత్తాను రమన్నారుండీ....ఆరు రాయం గానే తమరు నాకట్టాలు కాని తొందరగా పని చేయించండి బాబూ.... గోడలన్నీ ఎక్కడియక్కడ పడిపోయి, చూరులోంచి బొటబొటా కారి పోతుండాయండి .... మీకు తెలియనిదేముంటుంది. బాబూ.... అఖక్కి మిమ్మల్ని సంతోసపెడతాను అని మనవి సేసుకుంటూన్నా...."

"మీరు పొరబడుతున్నారు రాజుగారూ, నేను అట్లాంటి వాణ్ణి కాదు....నాకేమీ అక్కరలేదు....కాగితం రాగానే తాసీల్దారుగారిచేత ఆర్డరు వేయించి అయిదొందలు యిప్పించేస్తా....తాసీల్దారుగారు వొస్తు న్నట్లున్నారు....మీరు ఆ బయటే కూర్చోండి....కాగితం రాగానే పిలి పిస్తా" సత్యం నవ్వుకుంటూ లోపలికెళ్ళి కూర్చున్నాడు కాగితాల ముందు.

తాసీల్దారుగారు ఎవరిదో కారులోవొచ్చి దిగేరు, వారి వెనకాలే ప్రక్కవూరి పంచాయితీబోర్డు సభ్యుడు రంగరామయ్యగారు నడు స్తూండగా తాసీల్దారుగారు వారి గదిలోకి వెళ్ళేరు.

అయిదు నిమిషాలన్నా కాకుండానే తాసీల్దారుగారు సత్యాన్ని పిలి చేరు లోపలికి; ఏదో కాగితం వొకటి సత్యంముందు పడేసి, "దానికి వెంటనే వో చెక్కురాసి పట్రా" అన్నారు, సత్యం ఆ కాగితాన్ని పరి శీలించేడు. రంగరామయ్యగారి పేరను వున్న దరఖాస్తది. 2000 రూపా యలకి ఋణదరఖాస్తు. రివెన్యూ ఇన్‌స్పెక్టరు రిపోర్టుగాని' యింటిప్లాను గాని, యితర వివాదాలుగాని ఏమీలేవు. దానితో సత్యం వక్కక్షణం

విస్తుపోయి, వెంటనే లేచుకొని తనబిల్లవద్దకు వచ్చి కూర్చుని 2000 రూ॥లకు చెక్కు తయారుచేసి దరఖాస్తును ఫైలులో పెట్టుకున్నాడు. తాసీల్దారుగారి మంజూరు అర్డరు వుండగా తనకేం భయం మధ్యః

చెక్కును తీసుకెళ్ళి తాసీల్దారుగారి చేతిలోపెట్టి, డిస్పాచ్ బుక్కును ఎదురుగా పెట్టేడు రంగరామయ్యగారు చెక్కును తీసుకుని డి. సి. లో సంతకంచేసి లేచేరు. వెనకాలె తాసీల్దారుగారు లేచేరు. కుర్చీ మీద కండువా తీసుకొని

తాసీల్దారుగారు వెళ్ళిపోతుండగా సత్యం అన్నాడు "ఆ పూరి రైతు వారం రోజులనుంచీ తెగ తిరుగుతున్నాడండీ. దానిమీదకూడ వేసేస్తే వదిలిపోతుందేమో."

"తిరిగితే తిరగనియ్యి. నీ కేమిటి మధ్యః డబ్బు కావలసినవాడు తొందరపడితే ఎట్లా—అర్జంటు కాగితాలుంటే సాయంత్రం ప్యూన్‌చేత ఇంటికి పంపించు" అంటూ వెళ్ళిపోయేరు.

సత్యం కుర్చీలో కూలబడిపోయేడు. అపును. తనకేమిటి మధ్యః రంగరామయ్య వంటి తుఫాన్ బాధ తెలియని మోతుబర్లు, పనికులు అయిదు నిముషాల్లో చెక్కు తీసుకెళ్ళగా పాపం, ఆ రైతు ఎన్నివతి గాపులు పట్టున్నాడో, ఏక్కడుంది న్యాయం! ఎక్కడున్నది ధర్మం! "

ఇవ్వాళ జీతాలువచ్చే రోజు. సత్యం పనిచేసుకుంటూ తనకి లనే కూనిరాగం తీస్తున్నాడు సన్నగా. కాస్సేపటికి తను కూనిరాగం తీస్తు న్నట్లు తెలుసుకుని "టకీ' మని ఆపుచేశాడతను. గడియారంవంక చూసేడు. 2-45 అయింది. "ట్రెజరీకెళ్ళిన జవాను యింకా రాలేదేమో" అనుకుని మళ్ళా పనిలో నిమగ్నుడయ్యేడు.

రూపాయల సంచీ ఘల్లుమంది, తలెత్తి చూసేడు సత్యం. ఘన కార్యం చేసినట్లు చాటంత మొహంతో జవాను వచ్చేడు.

"పేరోల్"లో సంతకంచేసి రు. 79-15-0లతో తిరిగివచ్చి సత్యం కాగితాలముందు కూర్చున్నాడు. వక్క కాగితమైనా పని సాగిందికాదు. ఎందుకో అతని హృదయమంతా చీకటితో విండినట్లయి

పోయింది. ఈ పక్క క్షణంలో ఏమొచ్చింది దనకి? ఇందాకటి ఆనంద మంతా ఉత్సాహమంతాఏమయిపోయింది?ఎనభై రూపాయలు: అమ్మ తను, తమ్ముడు దేముడు మేలుచేస్తే వొచ్చేనెలనుంచీ తనభార్యకూడా. బ్రతకాలి: పాలది, పెరుగు మనిషి, చాకలి మనిషి, కిరాణాకొట్టాతను ఇంటాయన అప్పుసించ సాగేరు ఒకరి తర్వాత వకరు. 8 5, 4, 10, 20 క్రిందకు దొణా దొణా సీళ్ళలాగా కారిపోయేయి రూపాయలు. జేబును చూచు కుంటున్నాడు అతను బాధతో; దాదాపు 33 రూ॥లున్నాయి మిగిలి. మిగి లిన 29 దినాలకి అవే దిక్కు: వాటితోటే బియ్యం, నెయ్యి, నూనె, పప్పులు కొనాలి. తను కాఫీ తాగాలి!....సిగరెట్లు కొనుక్కోవాలి.

సిగరెట్ మీదకి మనస్సు పోయిందా తనకి జేబూ తడుముకొని చూచుకున్నాడు. ఒకే ఒక సిగరెట్టుంది. జేబులో నోట్ల మధ్య వొదిగి, గడియారంవంక చూచేడతను మళ్ళీ. అయిదున్నర. తాసీల్దారు వెళ్ళగానే, వెనకాలే సత్యంలేచి యింటిముఖం పట్టేడు-సిగరెట్ కాల్చుకుంటూ, ఆలోచించుకుంటూ.

"33 రూపాయలు, 29 రోజులు ఈ నెలలో వక చొక్కా కుట్టించు కుందామనుకున్నాడు తను. ఇంకేం కుట్టిస్తాడు? ఒచ్చే నెలే!" వెంటనే తన తమ్ముడు గుర్తుకొచ్చేడు సత్యానికి. వాడు కాలేజీ కెళ్లే కుర్రాడు! చిరిగిపోయిన దుస్తులతో అట్లాగే వెడుతున్నాడు! వాడికి వచ్చే నెలలో కుట్టిద్దామనుకున్నాడు తను కాని ఎట్లా? పోనీ పై నెలలో! పై నెలలో తను చెప్పులు కొనుక్కుందామనుకున్నాడు. ఆ పైనెలలో అమ్మకో పైను పంచె కొందామనుకున్నాడు. ఛీ! తన కార్యక్రమం అంతా తల క్రిందులై పోతోంది. తమ్ముడిని, అమ్మని, అన్నని ఎవర్నీ తను సంతోష పెట్టలేక పోతున్నాడు." సిగరెట్ చెయ్యి కాలగా విసిరి పారేసి కళ్ళుకొట్టు ముందాగే డతను.

"ఒక సిజరు పెట్టె అని చెప్పబోయి ఆగేడతను. "సిగరెట్లు ఖర్చు తను తగ్గించుకొని, తమ్ముడికో చొక్కా కొనిస్తే ఏం?" అని

ఎవరో అన్నట్లయ్యింది. చాలా బావుందిది. అమ్మగూడా ఎంతో ఆనందిస్తుంది. రైట్!

అణా బీడీలు కొనుక్కొని ఆనందంతో హృదయం గంతులు వేస్తూండగా ఇంటికి నడిచే డతను.

ఇంట్లో అడుగు పెట్టగానే తల్లిని పిల్చి 79 రూపాయలు ఇచ్చే డతను తల్లి వక్క క్షణం విస్తుపోయి, నెమ్మదిగా అన్నది "అంతా ఇచ్చేసావేంరా....నీ ఖర్చుకు ఏమయినా వుంచుకో."

"ఇవ్వాళనుంచీ నేనూ సిగరట్లు కాఫీలు మానేస్తున్నానమ్మా. ఇంకేం ఖర్చుంటుంది? కావలిస్తే అడిగి తీసుకుంటాలే....నీ దగ్గరుంచు.

"మా నాయన ఎంత బుద్ధిమంతు డయ్యేడు....ఇన్నాళ్ళూ ఆ సిగరెట్లు మానరా అంటే విన్నావూ....నీ అంతట నీకే తోచాలి గాని వకరి మాట నువ్వు ఎప్పుడు విన్నావు గనక....ఖర్చే కాకుండా, అవి గుండెలు కూడా పీల్చేస్తాయిటరా."

సత్యం నవ్వి "సబ్బుబిళ్ళ ఎక్కడమ్మా" అంటూ దొడ్లోకి వెళ్ళి ముఖం కడుక్కొని తిరిగి వచ్చేడు. తల్లి పైకాన్ని రెండుసార్లు లెక్క పెట్టుకున్నది కాబోల్ను అప్పుడే ట్రంకుపెట్టెలో పెడుతూన్నది.

"అందులో వక అయిదు రూపాయలు గోపాలానికి యిచ్చి వాచీకొక్క ఏదైనా కుట్టించుకోమనమ్మా" అన్నాడు తల దువ్వుకుంటూ.

తల్లి ఆనందంతో మాట్లాడ లేకపోయింది. "అట్లా బయటకు షికారెళ్ళి వస్తానమ్మా" అంటూ పార్కువైపు నడిచేడు సత్యం నిండు హృదయంతో.

* * * *

ఆఫీసునుంచి వక సాయంత్రం ఇంటికి వస్తున్నాడు సత్యం! సగం దూరమైనా రాకుండానే పాతచెప్పు కాస్తా "పట్" మని తెగిపోయింది. సత్యం ఏమీ తోచక రోడ్డు ప్రక్కనే నిలబడి పోయేడు. సంవత్సరం క్రితం ఆరు రూపాయలకి కొన్న చెప్పులవి. ఇప్పటికి ఏడెనిమిదిసార్లు కుట్టించి బాగుచేయించాడు వాటిని తను. ఇంకెంత కాలం వస్తాయి?

చేతిలో న్యూసు పేపరున్నా బావుండును....పొట్లాం కట్టి ఇంట్లో పార వేసేవాడు....తన తమ్ముడైనా తొడుక్కునేవాడు. పాపం ఎండలోనూ, వానలోనూ చెప్పులు లేకుండానే నడుస్తున్నాడు వాడు. చూస్తూచూస్తూ వాటిని రోడ్డుప్రక్కన వొదిలి వెయ్యలేక కాళ్ళీడ్చుకుంటూ నెమ్మదిగా నడవసాగేడు సత్యం.

ఇంతలో వెనకనుండి ఎవరో కేక వేసేరు. "ఒరేయి సత్యం.... విన్నేరా...." సత్యం ఆగి వెనక్కి చూచేడు. తన సహాధ్యాయి రత్తయ్య.

సత్యం వెంటనే సిగ్గు వచ్చాడు తన చెప్పుల అవస్థ తన మిత్రు డెక్కడ చూస్తాడోనని.

"ఏంరా! ఎక్కడ వుంటున్నావ్. చాలా దినాలకి అవుపించేవు?" అన్నాడు సత్యం చిరునవ్వుతో.

"ఇంకెక్కడ! "బా—" పి. డబ్ల్యు. డి. లోనే. నువ్వెక్కడైనా చేరావా ...లేక ఇంకా చదువుతూనే వున్నావా?"

"ఊఁ మధ్యనే చేరానోయి రాయాకాఫీసులో."

"బ్రాంచి?"

"తోప్సు."

"ఇంకేం అయితే. ఏ మాత్రం వెనక వేశావేం?"

"ఛ! ఛ! ఏదో రోజులు యిల్లా వెళ్ళిపోతున్నాయి."

"ఒరేయి మన దగ్గిర దాచకు. నేనూ ఏవో కాస్తో కూస్తో అవకాశం వుంచే పనిరేరకం కాదు. నీ దయవల్ల యిప్పటికి రెండువేలు బ్యాంకిలో పారేశాను. ఇందులో తప్పేముంది? రేపు రోగం రొచ్చు వస్తే మనల్ని ఆదుకునే దెవడోయి యిప్పుడు జాగ్రత్త పడకపోతే."

"అబ్బే! నా కలాంటి అలవాటులేదు"

"ఒర్రేయి వెర్రాడిలా మాట్లాడకు నాతో. నువ్వంటే విన్నటి వరదు చదువు వెళ్ళిస్తూ నేటికి వుద్యోగంలో చేరేవు. కష్టమో, సుఖమో,

మంచీ, చెడ్డా, సన్నాడుగూ నేను చెబుతాను. ఆవేళనుంచీ రాత్రనక పగలనక, గొడ్డులాగ చేస్తున్నా ఈ ఉద్యోగాన్ని: ఏం సంపాదించేను? రెండువేలు! ఎప్పటికీ కష్టంలేకుండా కొంచెం నోరు తెరచి అడిగే రకాలున్నాయి మా ఆఫీసులోన. వాళ్ళు సంపాదించేరు నాలుగయిదువేలు. తప్పేముందిరా యిందులో అసలేమిటి బాధ? ఎప్పుడూ యివ్వడం లేదా? పూర్వం రోజుల్లో మర్చి రాసుకో....అయినా తాలూకా అంటే కాస్తో కూస్తో గిట్టవలసిందేనే?"

"గిట్టుతుంది గాని, నా కట్లాంటి పనులు యిష్టంలే."

"ఇష్టం లేదా? మీ అన్నయ్య ఎక్కడుంటున్నాడేం?"

"గుంటూరులో?"

"అమ్మా, తమ్ముడూనో?"

"నా దగ్గరే వుంటున్నారు. ఏం?"

"ఏం లేదులే. మీ ఆవిడ కాపరానికొచ్చిందా?"

"ఆ! ఆ. మొన్ననే వచ్చింది."

"అయితే మొత్తం మొసభై వస్తోందా?"

"ఆ ఆఁ తక్కువేగా"

"ఒరేయ్! 79 రూపాయల్లో ఈ మహాపట్టణంలో తల్లీ, తమ్ముడూ, నువ్వూ, భార్యా, పిల్లా బ్రతుకుదా మనుకుంటున్నార్రా! మీ అన్నయ్య ఏమైనా పంపిస్తున్నాడేంరా?"

"అదివరకు పంపించేవాడు గాని....వాడికి పిల్లాజల్లా పుట్టుకొస్తుంటే ఏం పంపించటంలేదు."

"నాకు తెలియక అడుగుతాను: యిప్పుడంటే ఏదోవుంటే తిని, లేకపోతే పడుకుంటావు. రేపు ఒకమాత్రం పిల్లా, జల్లా పుట్టుకొస్తే ఏమవుతావ్రా చెప్పేంతా! రేపటి సంగతెందుకు? యివ్వేళ బియ్యం 80 రూపాయలు పెరిగింది....ఏం తిందామనుకున్నావురా?"

సత్యం నవ్వి ఊరుకున్నాడు!

"అదేమిట్రా వెర్రాడిలా నవ్వేరావు! ఇది చావు బతుకుల సమస్యరా! ఆ చొక్కా ఏమిటి? ఆ తలకాయ ఏమిటి? ఎట్లా బతుకుతున్నావురా యింత వెర్రాడివై? ఈ ప్రపంచంలో యింకా నీతి నియమాలు అంటూ కూర్చుంటే మాడి చచ్చిపోతావురోయి. నాకు ఆరేళ్ళ అనుభవముంది. నన్నడుగు నీకేమైనా తెలియకపోతే....వాళ్ళంతట వాళ్ళిచ్చినా కూడా తీసుకోడానికేంరా....అదికూడా వద్దంటున్నావా....?"

అవునని తలూపేడు సత్యం.

"ఛీ! ఛీ! ఏం మనుషుల్రా మీరు! ఆ పార్టీ సంతోషించి తృణమో ఫలమో ముట్టచెబితే తీసుకోడానికేమిట్రా! నిజానికి మనం కష్టపడి పని చేసినందుకు. ముఖ్యంగా అన్ని కాగితాలనీ అలాపుంచి వారి కాగితాన్ని వెంటనే బయటకి లాగి త్వరగా ఆ వ్యవహారం ఫైసలా చేయించినందుకు, కాస్తో కూస్తో తినడానికి పూర్తి హక్కులున్నాయి. లేకపోతే రాత్రింబవళ్లు పెళ్లాం బిడ్డలను మరచిపోయి యీ కాగితాలను పట్టుకొని వేళ్లాడటానికి ఎవరికి అచ్చివున్నామోయ్ మనం? వంద రూపాయలు పెడితేనేగాని ఆలుమగలు బ్రతకలేని యీ దినాల్లో డెబ్భై రూపాయలకి యీ బానిసత్వాన్ని కొని ఇంటి వద్దనున్న సంసారాన్ని మాడ్చి చంపేదెవరోయి? ఆదర్శాలు.. నీతులు అంటావా! అవన్నీ చదువుకొనే దినాల్లోని స్వప్నాలు ఆచరణలో పెట్టడానికి అవేమీ పనికిరావు....మీ తాసీల్దారెవరు ఇప్పుడు? సుందరయ్యేనా. ఆయన్ని గురించి నన్నడుగు చెబుతాను—నాలుగేళ్ళ క్రితం తాసీల్దారాఫీసులో....ఆర్. ఐ. గా వుంటూ ఎంత సంపాదించాడో తెలుసా నువ్వు? ఏభై వేలు....తాసీల్దారయ్యాక మా వూరిదగ్గరే నాలుగెకరాలు కొన్నాడు మొన్న మొన్న....బంగారం లాంటి చేను....ఎక్కడిదంటా....ఆ కాళ్ళట్లా ఊపేస్తావేం...."

సత్యం మొగం చిన్నబోయింది. తక్షణం భూదేవి గర్భంలో తానదృశ్యుడయిపోతే బావుండు ననుకున్నాడు.

"నేను నీకన్న అన్నివిధాలా కాస్తో కూస్తో పెద్దవాణ్ణి: నేను చెప్పింది జాగ్రత్తగా ఆలోచించుకో. నువ్వు ఎవరింట్లోనూ దొంగతనం చెయ్యడంలేదు. ఎవర్నీబలవంతంచేసి నాకది కావాలి. ఇది కావాలీ అని అడగటం లేదు. ఎవరైనా ఏదైనా యిస్తే తీసుకో. పెద్దనకు, తల్లీ, తమ్ముడు, పెళ్లాం యింకా దేముడు మేలుచేస్తే పిల్లా, పీచూ నీవెనక వున్నారని గుర్తుంచుకో. ధనలక్ష్మివద్దని కాలదనుకొన్నావా.... నువ్వు అరిచి చచ్చినా, నీవద్దకికరాదు. ఏం మా అందరికన్నా నువ్వు పూర్తి పొడిచేవా....నీతులు చెపుతున్నావు. నీతులు! పాపం! గంపెడాశతో వస్తారు వాళ్లు. వాళ్ళకి సాయంచేసిన వాళ్ళని రుణంలో నుంచుకావా? నువ్వు వద్దని కసురుకుంటే వాళ్ళెంత చిన్నబుచ్చుకుంటారో నీకేం తెలుసురా....నన్నడుగు చెబుతాను...."

సత్యంకి నవ్వు ఆగింది కాదు. కష్టంమీద నవ్వును ఆపుకోగలి గేడు—"యిప్పుడెక్కడికి పోతావు... మా యింటికిరా—భోజనంచేసి మరీ పోదువుగాని" అన్నాడు.

"థ్యాంక్స్—పురంలో మా పిన్నీవాళ్ళున్నారు. అక్కడికి వస్తానని మాటిచ్చేను. ఒరేయి అనవసరంగా వెర్రులు పోడక నేను చెప్పింది నిదానంగా ఆలోచించు. బాగుపడు. ఇప్పటికే నా కాలస్యం అయింది—వస్తా" అంటూ వెళ్ళిపోయాడు.

సత్యం వక నిట్టూర్పు వదిలి కాళ్ళీడ్చుకుంటూ నెమ్మదిగా యింటి ముఖం పట్టేడు.

* * *

తల్లికి వంట్లో బాగుండకపోవడంవల్ల సత్యం ఆ దినం కాస్త ఆలస్యంగా భోజనంచేసి ఆఫీసుకు పరుగెత్తేడు....తాసీల్దారుగారు ఏమంటారో అని హడలిపోతూ. అదృష్టవశాత్తూ ఆ దినాన తాసీల్దారుగారు యింకా రాలేదు. బ్రతుకు జీవుడా అనుకుంటూ సత్యం బాగితాలకట్ట ముందు కూలబడ్డాడు.

సత్యం చేతులేవో పని చేస్తున్నాయన్నమాటేగాని అతని మన స్సంతా ఎక్కడో వుంది. అతని మనస్సు తీవ్రమైన విషయాన్నిగూర్చి దీర్ఘంగా ఆలోచిస్తూంది.

పని చేస్తున్న సత్యానికి మొట్టమొదట తమ్ముడి కాలేజీ ఫీజు కట్టాలి కాబోల్ను అనే ఆలోచన వొచ్చింది. మొన్ననే కదా కట్టింది అని సమాధానం చెప్పుకొని ఆ భావాన్ని అణగ ద్రొక్కటోయేడతను. కాని మొన్న అంటే ఎప్పుడు? నెలక్రిందట! ఎంత కట్టేడు? ఇరవై. పోతే మిగిలిన ముప్ఫయి యీ నెల కట్టపద్దూ! అన్నయ్య సాయపడగల్గితే ఎంత బావుండును. వాడికిమాత్రం కష్టసుఖాలు తెలియవూ? పంపిస్తాడు అని సమాధానం చెప్పుకున్నాడు.

వెంటనే యింట్లో బియ్యం నిండుకోబోతున్న విషయం గుర్తు కొచ్చింది. అప్పుడుశేషనుషాపు క్యూలో నిడబడాలంటే జేబులో మూడు రూపాయలుండాలి? ఎవర్ని అడగాలో ఆలోచించాలి.

అమ్మకి వంట్లో బావుండటంలేదీమధ్య, ఆమె పెద్దదయి పోతూంది. ఆరోగ్యం సన్నగిల్లుతూంది. తాను అశ్రద్ధచేయకుండా వచ్చే నెలైనా పది రూపాయలు ఖర్చుపెట్టి డాక్టరుకి చూపించాలి. రెండునెలలనుంచి వాయిదా వేస్తున్నాడే తనని తాను ఒచ్చే నెల తప్పక చూపించాలి

యింటద్దె, అమ్మకి చీర, తమ్ముడికి చెప్పులు తనకి చొక్కాలు కూడా గుర్తుకువచ్చే సరికి ఈ కలాన్ని బల్లపైన వదిలి బాధతో తలను రెండు చేతుల మధ్య పట్టుకున్నాడు సత్యం.

ఏమిటీ జీవితం? ఎందుకోసం బ్రతుకుతున్నారు తామంతా? లేచినది మొదలు బాధలేనా? ఒక అవసరం లేకుండానే మరొక అవసరం వొచ్చిపడుతూంటే తనలాంటి యువకుడేం చేయాలి? కాలేజీలో చదు వుతూ వూహించుకున్న జీవితమేనా యిది? శుభ్రమైన గాలి, ఆహారం, చీకూచింతా లేని నిర్మలమైన మనస్సు. తీరికైనప్పుడల్లా సంఘసేవ, సత్యం, ధర్మం....యివేనా!

బూట్లు టకటకలాడించుకుంటూ రివెన్యూ ఇన్‌స్పెక్టరు వచ్చేడు. వెనకాలే తాసీల్దారుగారు. సత్యం ఆలోచనలోనుంచి తేరుకొని తిరిగి పనిలో నిమగ్నుడయ్యేడు.

మళ్ళీ 8000 రూపాయలు పైగా మోటబులైన ఖాస్వాములకి అప్పులు మంజూరుచేసి తాసీల్దారుగారు నాలుగు కాకుండానే వెళ్ళి పోయేరు. సత్యం ఆ పన్నీ లేఖలు వ్రాసుకొని లేచేసరికి ఆయిదుంపావు అయ్యింది.

హైపిస్టుకూడా టైపుమిషను మూసేసిలేస్తూ, వున్నట్లుండి అన్నాడు. "సత్యం నేటితో మన దరిద్రం తీరిపోతూంవోయి" అని.

"ఎట్లాగ?" అడిగేరు సత్యం ఆశ్చర్యంతో,

"మనకి 60,000 రూపాయలు రాబోతున్నాయి."

"నిజం?

వెర్రాడిలా వున్నావు? ఇంకా సందేహమా? ఒక వారంనుంచి ఆలోచించి ఆఖరికి యిప్వేళ నిశ్చయానికి వచ్చేసేను."

సత్యానికి ఏమీ అర్ధంకాలేదు వెల్లబోయి హైపిస్టువైపే చూస్తూ నిలబడిపోయేడు.

"నిజమేనోయి! నీకుకూడా ఏమైనా కావాలనుంటే ఓ రూపాయి వ్వరు ఇయ్యి"

"ఇంతేనా! జీతాలొచ్చేక యిస్తా....యిప్పుడెక్కడనుంచి తెచ్చేది ....అసలేమిటిది"

"షడిల్!"

"చంపేవు వాటిమీది నాకసలు నమ్మకం లేదసలు"

"అదే దురదృష్టం అంటే ఏమైనా చేసేటప్పుడు పూర్ణ విశ్వాసం వుండాలి. వస్తుందని వేస్తే వస్తుంది లేకపోతే వొచ్చేవాళ్ళందరికీ తెలివితేటలవల్ల వస్తోందంటావా?"

"మరే. నీఅంత విశ్వాసం కలవాళ్ళు యింకెవ్వరూ లేరు దేశంలో....నీ కోసమే వాళ్లు పజిల్సు పెట్టేది....60 000 లు యిస్తాము" అన్నాడు ఇన్ స్పెక్టరు ఎత్తి పొడుస్తూ.

"అవునోయి. కొందరికి అంచాలపై విశ్వాసం ఎక్కువ. మరి కొందరికి ఆత్మపై విశ్వాసం ఎక్కువ. మీలాంటి వాళ్ళకోసం పజిల్సు పెడితే, మీలాంటి వాళ్ళకోసం "లోనన్సు" పెట్టేరు ప్రభుత్వం వాళ్ళు" అన్నాడు పైపిస్టు మృదువుగా.

"ఏయ్ అనవసరంగా నోరు పారేసుకోకు. ఎవరు తిన్నారు లంచాలు ?"

"మీ తాసీల్దారునే అడుగరాదూ: వారి కంటె. నీ కంటె నా కెక్కువ తెలుసా"

ఈ పైపిస్టు యింత కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాడతాడని సత్యం ఎన్నడూ అనుకోలేదు. తాసీల్దారు గారనైనా జంకకుండా, అన్యాయాన్నెదుర్కొంటూ పైపిస్టు మాట్లాడటం సత్యానికి అమితానందాన్ని కల్గించింది. ఉత్సాహం పొంగి పొరలగా అతనికి "హియర్ హియర్" అని చప్పట్లు చరుద్దామనిపించింది. వెంటనే వరండాలోని గుమస్తాలు కొందరు నవ్వేసేరు. సత్యంకూడా ఆనందంతో నవ్వు తెలియకుండా నవ్వసాగేడు.

'పూర్స్' అనుకుంటూ వెళ్ళిపోయేడు ఇన్ స్పెక్టరు సైకిలెక్కి.

సత్యం తీసుకుని పైపిస్టుతో అన్నాడు. "నిజమేనోయి....నాదబ్బు తర్వాత యిస్తా....నువ్వు పంపించు పజిల్సు మరుసు"

"బహుమానం వస్తే చెరి సగం...."

"రైట్ యింకా అనుమానమెందుకు"

సత్యం పజిల్ వచ్చినట్లే వూహింపుకుంటూ యింటికి నడవసాగేడు.

సత్యం యింటికి వెళ్లేసరికి భార్య వెలపల కూర్చుని వున్నది. లోపలకు వెళ్ళేసరికి తల్లి మంచంమీద పడుకొని బాధగా మూల్గుతూంది. శాలువా కప్పుకొని వున్నా గజగజా వణకుతూంది.

మంచందగ్గిరకొచ్చి విచారంగా తల్లిని చూస్తూ అడిగేడు "జ్వరం వచ్చిందా అమ్మా?" అని.

"వళ్ళంతా కాలిపోతూందిరా యిందాకటి నుంచీ" అన్నాడు వంటింటిలోనుంచి తన తమ్ముడు.

వీడేం చేస్తున్నాడు లోపల? చూసేడు అతను పొయ్యి రాజెయ్యడానికి నానా అవస్థ పడుతున్నాడు వాడు. బియ్యం వుడికిస్తాడు కాబోల్ను ఒక గిన్నెలో ప్రక్కగా పెట్టుకొని వున్నాడు. ఒక నిట్టూర్పు విడిచి కాళ్ళు చేతులు, ముఖం కడుక్కొని తిరిగి వంటింటిలోకి వచ్చి నిలబడి, నేనుకూడా వస్తాను వుందు....యేదో ఒకటివేసి పారేద్దాం" అన్నాడు తనకి ఏం చెయ్యాలో, ఎట్లా చెయ్యాలో తెలియకపోయినా.

"నువ్వు ఒద్దులేరా....నే నొక్కణ్నే చెయ్యగల్ను....అమ్మని ఒక సారి డాక్టరుకు చూపిస్తే బావుంటుందేమో!"

తల వూపి సమ్మంలో కూలబడ్డాడు సత్యం. డాక్టరు! డబ్బివ్వకుండా ఏ డాక్టరు వస్తాడు? డాక్టరు వచ్చి చూచినా ఇటాక్కవాడి కివ్వడానికైనా తనపెద్ద అర్థరూపాయికూడా లేదే? ఎక్కడో అక్కడ చూడాలి. ప్రక్క సందులో నారాయణరావుగారు రాడూ! తను ప్రయత్నించి చూస్తేగా అసలు....

ఎట్లాగైతేనేం పొయ్యి రాజేసేడు తన తమ్ముడు, బియ్యంగిన్నెను పొయ్యిమీద కెక్కించి, వంకాయలు తరుగుతున్నాడు. కూరకూడా చేస్తాడు కావల్ను. యివన్నీ ఎక్కడ నేర్చుకున్నాడో వీడు. వెధవకి అన్ని విషయాలు తెలుసు. తెలివికలవాడు. చాలా పైకొస్తాడు చదువు కుంటే; ఎంత కష్టపడైనా తనువాణ్ణి బాగా చదివించాలి....అమ్మగట్టిగా మూలుగుతోంది....తను వెళ్ళి డాక్టరును చూచి వస్తే....

సత్యం లేచి మాటా మంతీ లేకుండా డాక్టరు యింటివైపుకు బయల్దేరేడు.

డాక్టరుగారు సత్యం చెప్పింది విని మాటాడక బయలుదేరి వచ్చేరు—జట్కా కూడా అక్కరలేకుండానే. చూసేసరికి జ్వరం బాగా వుంది. "మరేం పర్వాలేదు. మందిస్తా తగ్గిపోతుంది, నాతో ఎవరయినా రండి" అన్నారు.

సత్యమే వెళ్ళాడు వక ఖాళీసీసా పుచ్చుకొని. మూడుపూటలకి సరిపడ్డ మందు తీసుకొని సత్యం తిరిగి వచ్చేసరికి అన్నం వండేస్తాడు అతని తమ్ముడు. కూర వుడికిస్తున్నాడు.

తల్లి ఒక దోసు మందు తాగి మూలుగుతూనే అంది "ఏం అవస్థలు వచ్చిపడ్డాయిరా మీకు, చదువుకోవలసిన ఆ కుర్రకుంక ఏం కష్ట పడుతున్నాడు....!నెయ్యి తక్కువగా వున్నట్లుంది—ఎదో యీ పూటకి గడుపుకోండి....నెయ్యి, మజ్జిగ, ఆ అలమారులో వున్నాయి" అంది.

ఆ పూటకి ఏదో అయిందనిపించి అంతా పడుకున్నారు. సత్యానికి ఏ మాత్రం నిద్రపట్టటం లేదు. అతనికి కావలసినదాన్ని ఆలోచనలు. "రేపు ప్రొద్దున్నే ఎక్కడో అక్కడ పైకం అప్పుతెచ్చి నెయ్యి పట్టుకు రావాలి....జీతం రాగానే డాక్టరుకు వక పది రూపాయీలు యివ్వాలి.... లేకపోతే బావుండదు....! యీ రెండాలోచనలు పూర్తవకుండానే యితర అప్పులు, బాకీలు కళ్ళముందు సాగాయి. వెంటనే అతనికి క్రాసు వర్డు పజిల్సు సంగతి గుర్తుకొచ్చింది. అవును. తన దరిద్రం తీరిపోటో తుంది, అందుకనే అట్లా అయాచితంగా టైపిస్టు సుబ్బారావు తనని కలుసు కున్నాడు. కనీసం పదివేలొచ్చినా చెరో అయిదువేలు పంచుకుంటారు, శుభ్రంగా అప్పులన్నీ తీర్చేసి అమ్మకి, తమ్ముడికి, భార్యకీ వో వెయ్యి అయినా ఖర్చుపెట్టి ముందు బట్టలు కొనాలి తను, అవును—ముందు బట్టలు. తర్వాత యింకో వెయ్యి అన్నయ్య కిస్తాడు. పాపం వాడూ

నానా అవస్థలూ పడ్తున్నాడు, మిగతా మూడూ వేలూ ఎట్లా ఖర్చు చేస్తే మంచిదా అని ఆలోచిస్తూండగానే నిద్రపట్టేసింది.

తను కార్లో ఎక్కడికో వెడుతూన్నట్లు—తన తమ్ముడు బి. ఇ. చదువుతూన్నట్లు, తన తల్లి సంతోషంగా నవ్వుతూన్నట్లు—గుమస్తాలు, స్నేహితులూ తనంటే ప్రాణాలైనా యివ్వడానికి సిద్ధంగా వున్నట్లూ ఆ రాత్రల్లా అతనికి కలలు।

*  *  *

సత్యం వుదయాన్నే మందు తీసుకొచ్చి యింట్లోపడేసి, స్నేహితుల వద్దకి వెళ్ళేడు. ఎంత అప్పు అడగాలా అని కాస్సేపు తర్జన భర్జనలు చేసి ఆఖరికి అయిదు రూపాయలు అడగటానికి నిశ్చయించుకున్నాడతను, అయిదు రూపాయలు కాదు కదా, అయిదు అణాలుకూడా సంపాదించ లేక పోయేడు పది గంటల లోపుగా, ౹6 వ తేదీ ఎవరివద్దమాత్రం, ఎట్లా వుంటాయి. అని తనకి తనే సమాధానం చెప్పుకొని, ఏ కోమటి కొట్లోనైనా యిక నెయ్యి సాయంత్రమైనా అరువు తేవాలని నిశ్చయించుకొని, ఏదో తినేసి హడావుడిగా ఆఫీసుకు పరుగెత్తే డతను.

ఆఫీసుకు వెళ్లేసరికి గుమ్మంలో రివెన్యూ ఇనస్పెక్టరు నిలబడి సిగరెట్ కాల్చుకుంటున్నాడు. తనని చూడగానే ముఖాన్ని అవతలకు త్రిప్పుకొని ఎక్కడో చూడసాగేడు. సత్యం చిన్నబోయి లోపలకు వెళ్ళేడు.

హైపిస్టు సుబ్బారావు ఏదో కాగితం చూస్తూ "తాసీల్దారుగారు నిన్ను అడిగేరు ఎందుకో?" అన్నాడు,

అట్టెండెన్సులో సంతకంచేసి, చొక్కా సర్దుకుంటూ తాసీల్దారు గారి గదిలోపలి కెళ్లేడు సత్యం. తాసీల్దారుగారు పేపరు చూస్తున్నారు. ఒక నిమిషం అయ్యేక తల ఎత్తి "యిప్పుడు టైం ఎంతోయి?" అన్నారు.

"పదకొండుంబావు సార్."

"ఆఫీసు పదకొండింటికి కాదూ "

"అవునండీ. మా అమ్మకి జబ్బుగా వుంటే కాస్త—"

"అవున్లే నువ్వీ మధ్య చాలా పెద్దవాడి వవుతున్నావుట! స్టేటు మెంటు పోయిందా యీ నెలది?"

"యివ్వేళ వెడుతుందండి." సత్యంకి తాసీల్దారుగారి మాటలు అర్థం కాలేదు. తనేం చేసేడు? తననేనా అన్నది అయన?

"స్టేటుమెంటు యివ్వేళ పోయితీరాలి తెల్సా? సరే వెళ్ళు"

ఒచ్చేసేడు సత్యం. టేబిలుముందు కూర్చున్నాడు విస్తుపోయి. హైపిస్టు ఇదేమీ గమనించకుండా "సత్యం! ఇదిగో పజిలు అంతా పూర్తి చేసేసేను. ఇవ్వేళ పంపిస్తున్నా. ఓసారి చూస్తావా!"

సత్యం తేరుకొని "-మళ్ళా నేనెందుకు, నువ్వే పంపించేద్దూ." అన్నాడు.

"ఏం అట్లా వున్నావు?" అడిగేడు హైపిస్టు.

"ఏమీలేదు." అని స్టేటుమెంటుకి కావలసిన కాగితాలను సర్దుకో సాగేడు సత్యం.

రివెన్యూ ఇన్‌స్పెక్టరు లోపలికొచ్చి వోసారి సత్యం ముఖాన్ని ఎగాదిగా చూచి. ఖాళీగావున్న కుర్చీలో కూర్చుని ఏదో రాసుకోసాగేడు.

కాలం గడచిపోతూంది. సిరా కాగితాలమీద యింకిపోతూంది. కాగితాలు తిరిగి పోతూన్నాయి. కలాలు, పెన్సిళ్ళు కాగితాలమీద నృత్యం చేస్తున్నాయి.

సత్యం రెండింటికల్లా స్టేటుమెంటు పూర్తిచేసి, సంతకం చేయించి డిస్పాచ్‌లో యిచ్చేసి, కాఫీకి బయలుదేరేడు "అమ్మకి ఎట్లా వుందో? డాక్టర్ ఏమి ఆలోచిస్తున్నాడో యీ సమయంలో. రాత్రికి మళ్ళీ తమ్ముడు అవస్థపడి వంట చెయ్యాలి కాబోల్ను...."

సత్యం కాఫీతాగి అరువు పుస్తకంలో వ్రాసి వరండాలో నిల బడ్డాడు. కలెక్టర్ ఆఫీసు గుమాస్తా వకతను సిగరెట్ పొగను విలాసంగా

వదుల్తూ, ఎవరితోటో మాట్లాడుతున్నాడు. అతన్ని చూడగానే సత్యానికి సిగరెట్ మీదకి మనస్సు పోయింది. జేబులు తడుముకున్నాడు. జేబులు ఖాళీ. మనస్సుని యింకో విషయంమీదకి మళ్ళించేందుకు యత్నిస్తూండగా కలెక్టరాఫీసు గుమాస్తా, యింకొకాయనా ముందుకు వెళ్ళిపోయేరు. సత్యం హోటలు మెట్లు దిగబోతూండగా "—వూరు" రైతు ఎదురయ్యేడు "నమస్కారం బాబయ్యా" అంటూ సంచీ ఎత్తి!

"ఏం మీపని యింకా తేలలేదూ?" అన్నాడు సత్యం.

"యియ్యేళ తేలిపోవాలండీ. ఆర్. ఐ. గారుకూడా యియ్యేళ యిప్పించేత్తానన్నారండీ....మళ్ళీ యిదిగో యీసెడు వెన్న ముడుపు చెల్లించు కుంటున్నా"

సత్యం అడిగేడు—"మీ వూళ్ళో ఎట్లాగండీ వెన్న"

"ఎట్లాగైతేనేం బాబయ్యా....మీకు కావాలా సెప్పండి?" ఆదుర్దాగా అడిగేడు.

"అవునండీ, వక వీసె కావాలి ఎల్లుండికాని డబ్బివ్వలేను" అన్నాడు సిగ్గుపడుతూ.

"మీ యిష్టం ఎప్పుడన్నా యియ్యండీ. అయినా మారాజులు మీకో యీసె వెన్న సప్లయి సెయ్యలేకపోతే ఎందుకండీ మేం బతికి.... ఆర్. ఐ. గోరికి యింకోసారిచ్చుకుంటా యిది తీసుకోండి బాబయ్యా..." సంచిలోంచి చిన్నబుడ్డి బయటకు లాగేడతను. "వారికి తెచ్చినది నాకెందుకు.... రేపు తీసుకురండి నాకు"

"అదంతా మీకెందుకు....తీసుకోండి బంగారంలాంటి వెన్న. యిటువంటి రకం మళ్ళీ మీకు కావాలన్నా దొరకదు బాబయ్యా" అన్నాడు రహస్యంలాగ చెబుతూ, గిన్నెను తనచేతిలో పెడుతూ.

సరే, గిన్నె తోమించి రేపు ఉదయం పట్టుకొస్తాను....ఎంతేవిటి అసలు?"

"అదంతా తర్వాత సూద్దాం లెండి....కాస్త కాఫీ పోసుకోరూ...."

"నా దిప్పుడే అయింది....మీరు పుచ్చుకొని రండి" సత్యం నవ్వుతూ, గిన్నెను తీసుకొని ఆఫీసులోకి నడిచాడు.

ఆర్. ఐ. వరండాలో నిలబడి సిగరెట్ కాలుస్తూ, విచిత్రంగా సత్యం వైపొక పర్యాయం చూచి వెంటనే ముఖాన్ని ప్రక్కకు త్రిప్పుకున్నాడు.

సత్యం గిన్నెను కుర్చీక్రింద పెట్టి కాగితాలు చూచుకుంటూండగానే పార్టీ వరండాలో రెవిన్యూ ఇన్స్పెక్టర్ గారితో ఏదో బ్రతిమాలి చెప్పుకుంటున్నాడు కాసేపటికి రెవిన్యూ ఇన్స్పెక్టరు తాసిల్దారుగారి గదిలోకి వెళ్లేడు....ఏవో కాగితాలు పుచ్చుకొని.

అయిదవ్వ బోతూండగా రెవిన్యూ ఇన్స్పెక్టరు బయటకు వచ్చి సత్యంతో అ—వూరి రైతుకి బాండు రాసి సిద్ధంగా వుంచమంటున్నారు తాసిల్దారుగారు. చెప్పి వెళ్ళిపోయేడు సత్యం రెవిన్యూ ఇన్స్పెక్టరుని ఎగాదిగా చూచి. కాగితాలు తీసి బాండు వ్రాసి సిద్ధం చేసిపెట్టి, మిగతా కాగితాలు చూచుకో సాగేడు.

పదిహేను నిమిషాల్లో తాసీల్దారుగారు బయటకొచ్చి, "అ....వూరి రైతు పాపం తెగ తిరుగుతున్నట్లున్నాడు." అన్నారు.

"కాగితాలన్నీ రాసి సిద్ధంగా వుంచేనండి. సంతకం చేస్తారా?" బాండు తీసుకొని లేచి నిలబడ్డాడు సత్యం.

"అప్పుడే వ్రాసేసే వన్నమాట?" అన్నాడు తాసిల్దారుగారు

సత్యం తల వూపేడు....మెప్పుకోసం ఎదురు చూస్తూ.

"ఊ, బాగానే వుంది. నా కిప్పుడు "టైం" లేదు....వుదయాన్నే చూస్తా. ఏమిటది ఆ కుర్చీకింద...."

"వెన్నండి" సత్యం చెప్పేడు.

తాసీల్దారుగారు మాట్లాడకుండా వెళ్ళిపోయేరు బయటకు. బయట వున్న రైతుతో కాబోల్ను "రేపు వుదయాన్నే రండి—మీపనే చూస్తా...." అంటున్నాడు. తాసీల్దారుగారు ఎందుకో కోపంగా వున్నారీ వేళ అనుకున్నాడు సత్యం.

ఉదయానికి తల్లి వంట్లో కొంచెం నింపాదిగా వుంది. డాక్టరు వచ్చి చూచి ఇంజక్షను యిచ్చి వెళ్ళిపోయేడు. సాయంత్రానికల్లా తల్లి లేచి తిరగవచ్చు. సత్యం మనస్సులోనే భగవంతునికో కృతజ్ఞతాభి వందనం చేసుకున్నాడు.

సత్యం తెల్లగా తోమించిన ఖాళీ బుడ్డితో ఆఫీసుకి వెళ్లేసరికి ఆఫీసంతా హడావుడిగా వుంది. రైతు వెలాతెలాబోతూ బయట నిలబడి వున్నాడు, తనని చూడగానే "నాకేమీ తెలియదంటీ బాబయ్యా....ఇదేం గోరమో" అన్నాడు, సత్యాని కేమీ అర్థం కాలేదు. ఖాళీ బుడ్డిని రైతు కిచ్చేసి ఆదుర్దాగా లోపలికి వెళ్లేడు సత్యం. గుమాస్తాలు, టైపిస్టులు పని మానేసి గుసగుస లాడుకుంటున్నారు.

సత్యం అటెండెన్సులో సంతకం పెడుతూండగానే "సారీ బ్రదర్ ! ఏంచేస్తాం, రోజులు బావుండ లేదంతే" అన్నాడు టైపిస్టు.

"ఏం ఏమయ్యింది ?" అడిగేడు సత్యం.

"ఏమవ్వాలి. నువ్వా వూరు రైతువద్ద వెన్న లంచం తీసుకున్నట్లు తాసీల్దారుగారు చార్జ్ ఫ్రేమచేసి కలెక్టర్‌కి పంపించేరు. రైతువద్ద కూడా స్టేట్‌మెంట్ పుచ్చుకున్నారు.

"లంచమా ? నేనా !" విస్తుపోయేడు సత్యం.

తాసీల్దారుగారి జవాను బయట కొచ్చి వక కాగితం యిచ్చేడు యింతలో సత్యం చేతికి. సత్యం వణికే చేతుల్తో అందుకున్నాడు దానిని. అందులో "నువ్వీ రోజునుంచి డ్యూటీనుంచి సస్పెండెడ్" అని వుంది.

సత్యం కాగితం పుచ్చుకొని తాసీల్దారుగారి గదిలోకి వెళ్లాడు తిన్నగా. తాసీల్దారు పేపరు చదువుకుంటున్నారు. సత్యం తిన్నగా అన్నాడు. "మీరు పొరబడ్డారు సార్. నేను డబ్బిచ్చే తీసుకుంటానని చెప్పేను, రేపు జీతాలు రాగానే యిస్తానని తర్వాత చెప్పేను. లంచం తీసుకునే వుద్దేశం నా కెన్నడూ—"

"సారీ మిస్టర్ సత్యం ఇదంతా నీ ఎక్స్‌ప్లనేషనల్‌లో. రాసుకో. నేనేం చెయ్యలేను. గుడ్ బై."

"నిజం చెబుతున్నా సార్"

"ఏద్రైనా చెప్పు. కాని నాతోకాదు. నీ ఎక్స్ప్లనేషన్లో గుడ్-బై"

సత్యం బయటికి వచ్చి నిలబడ్డాడు. అంతా అంధకారంలోవుంది. ఇది ప్రపంచమేనా ? వీళ్ళు మనుషులేనా ? వీళ్ళనేనా తను సోదరులని, దేశం అని ఏమేమో అనుకుంట.

తనకు తెలియకుండానే నడువ సాగేడు. ఎక్కడెక్కడో తిరిగి తిరిగి తిరిగి సాయంత్రం పార్కుకి చేరుకున్నా డతను ! ఎట్లా తను తల్లినీ, భార్యనీ చూచేది ! తన అన్న యివ్వేళ వస్తాడు కాబోల్ను వాడి కేమని చెప్పేది ?

మహా నేరం చేసిన వాడిలా కుమిలిపోతూ, చీకటి పడ్డాక యింటికి నడువసాగే డతను.

గుమ్మము వద్ద కొచ్చేసరికి ఎదురింటి గుమాస్తా రంగయ్యా తన అన్నతో ఏమేమో మాట్లాడుతున్నాడు. బహుశా తన సంగతే అయ్యుం టుంది. ఎంత సేపటినుంచి మాట్లాడుతున్నాడో ? ఏమని మాట్లాడుతు న్నాడో ! బహుశా తను లంచంగానే యీ పెన్నుని తీసుకున్నాడని వీళ్ళంతా అనుకుంటూ వుంటారు. ఆఖరికి తన అన్న గూడాను.

సత్యం తల వంచుకొని ఇంట్లోకి వెళ్ళబోతూండగా తన అన్న అన్నాడు. "మరేం ఫర్వాలేదు ! వెధవ వుద్యోగం పోతే పోయిందిలే. ముందు అమ్మని సముదాయించు ఏడుస్తూంది లోపల."

సత్యం తల వంచుకునే లోపలకు నడిచేడు తన తల్లి కండ్లు చెమ్మగిల్లి వున్నాయి తనను చూడంగానే కళ్ళు తుడుచుకొని ఏమీ ఎరగ నట్లు, "భోజనానికి లే బాబూ !" అన్నది.

మంచంమీద కూలబడి సత్యం అన్నాడు "నాకు ఆకలి వెయ్యటం లేదే....మీరంతా భోజనం చెయ్యండి."

"అదేమిట్రా ! భోజనం మానుకుంటారా. వెధవ వుద్యోగం పోయిందని....మా నాయన కదూ....లే" అమ్మకి మళ్ళీ కళ్ల నీళ్ళు తిరుగుతున్నాయి.

భవిష్యత్తంతా అగమ్య గోచరంగా వుంది సత్యానికి. మళ్ళీ మొదలా వుద్యోగంకోసం అన్వేషణ! తనని నమ్ముకుని వున్న తల్లీ, తమ్ముడూ, భార్యా ఏమయిపోవాలి తనకి వుద్యోగం లేకపోతే?

"మీ నాయన ఎంతో కీర్తి ప్రతిష్టలు సంపాదించుకుని హరీ మన్నారు. నువ్వూ ఆ చెట్టున కాసినందుకు అట్లాగే నాలుగు కాలాలు చేస్తావనుకున్నాను గాని....ఇంతలో యింత—"

"అమ్మా—" గద్గదిక స్వరంతో అరిచేడు సత్యం.

తల్లి వక్క వుదుటున వచ్చి సత్యాన్ని కౌగిలించుకుని "చెప్పు నాన్నా....చెప్పు. నువ్వావని చెయ్యలేదు కదూ!....చెప్పు బాబూ" తల విమురుతూ అంది.

"లేదమ్మా....లేదు. రెండు రోజుల్లో యిస్తానని చెప్పే తీసుకున్నా నమ్మా....ఎవరో కల్పించేరీ విషయం...." తల్లి కౌగిలిలోంచి ముఖా న్నెత్తి అన్నాడతను.

"అవును నువ్వట్లా చేసేనంటే నేను నమ్మలేదు బాబూ! మావాడు బుద్ధిమంతుడని నాకు బాగా తెలుసు. మా నాన్న వట్టి వెర్రినాయన" అంటూ సత్యం తలని ముద్దెట్టుకుని "పోసీలే ...వుద్యోగం లేకపోతే అడుక్కుని బ్రతుకుతాం. నువ్వేమీ దిగులుపడకు." ఓదార్చి సత్యం తల్లి.

మాతృమూర్తి స్వాంతవచనాలు వింటూన్న సత్యానికి పక్క సారిగా ప్రపంచమంతా ఏదో వింత వెలుగులో నిండినట్లయింది. అవును. ఉద్యోగం లేకపోతే చేసేదేముంది, అన్యాయంగా జీవించలేని వాళ్ళకి—అడుక్కుతినడం తప్ప!

బయటనుంచి అతని అన్నయ్య కమ్మగా చుట్ట కాల్చుసంటూ ఎవరితోటో మాత్రం "ఆః రేపీపాటికి ఆ తాసీల్దారుసు ఇక్కడనుంచి ట్రాన్స్ఫర్ చేయించి పారేస్తా! రోగం నదలిపోతుంది. మావాడు చెయ్యాలేకాని బోలెడు ఉద్యోగాలు"....అంటున్నాడు అన్నీ తన చేతిలో వున్నట్లు!

# స్వయంకృతం

స్టేషనులోని 'హిగ్గిన్‌బాథమ్స్'వద్ద నిలబడి క్రొత్తగా వచ్చిన పుస్తకాలను చూస్తున్న లక్ష్మణరావు. "హల్లో! మిస్టర్ లక్ష్మణ్ !" అనే పలకరింపుతో పక్కనే నిలబడివున్న నరసింహాన్ని గమనించేడు.

"హల్లో! కులాసాయేనా ?"

"ఆ! పుస్తకాలేమీ వచ్చినట్లు కనిపించవేం ?" ఏదో అడగాలి కనక అడిగేనుసుమా అన్నట్లు తేలికగా అన్నాడు నరసింహం చిన్న నవ్వుతో.

"ఏదో వున్నాయి. కొందామన్నా అందుబాటులో అవుపించని ధరలు! ఏం కొంటాము ? వస్తారా పోదాంఅట్లా ?"

"ఊఁ నడవండి. ఒక్కరే వచ్చేరేం....సుందర్రావు ఏడీ ?"

లక్ష్మణరావుకు ఆముదం త్రాగించబోయినట్లన్పించింది. నాలుగు దినాలక్రితం తను యీ ప్రశ్నకి తడుముకోకుండా సమాధానం చెప్పగలిగి వుండేవాడు. అస లిటువంటి ప్రశ్నలకు అవకాశమే వుండేది కూడా కాదేమో అప్పుడు.

మౌనంగా ఊరుకున్న లక్ష్మణరావును నరసింహం వదలలేదు. కాకపోగా "ఏం.... వంట్లో స్వస్తిగా వుంటూందా అతనికి మళ్ళీ ?" అని అడిగేడు.

నాలుగు దినాలనుంచి లోపల పేరుకొని మూలుగుతూన్న బాధంతా పక్కసాకి పొంగి పొర్లిపోవడానికి ప్రయత్నిస్తూన్న ట్లనిపించింది. గత నాలుగు దినాలనుండీ ఇదే మాదిరి ప్రశ్నలను అనేకమంది అడుగుతు న్నారు అతనిని. అనేక అబద్ధాలాడి తప్పించుకుంటున్నాడు అత

నూను. ఇప్పుడు ఒక్కసారిగా తన మనస్సునంతా విప్పి నరసింహం ఎదుట పెడదామా అన్పించింది అతనికి. కాగా కొంచెం నిగ్రహించు కొని "ఏమో—తెలియదు" అనేసేడు లక్ష్మణరావు.

నరసింహం ఆశ్చర్యచకితుడయ్యేడు. అహర్నిశయూ వకరినొకరు వదలకుండా తిరిగే ప్రాణమిత్రులు. ఒక శుభముహూర్తాన్ని వకరి సంగతి మరొకరికి తెలియదంటే, ఎవరుమాత్రం ఆశ్చర్య పడరు ?

పరిశీలనగా తనవైపే చూస్తున్న నరసింహాన్ని గమనించిన లక్ష్మణరావు, "దాచి లాభంలేదు" అనుకున్నాడు. ఒక్కసారిగా, పుస్తకంలా విషయాన్నంతా ఆతనిముందు పారవేసి తనెటయినా పారిపోతే ఎంతబాగుండును అన్పించింది అతనికి. అయినా మళ్ళీ తమాయించు కొని, "నిజమే, నాకు తెలియదు" అన్నాడు.

"అంటే....?"

ఇదే సమయం, చెప్పెయ్యాలి విషయమంతా. ఈ కథంతా, బాధంతా దాచుకోలేక తన హృదయం బరువెక్కి పోతున్నది. కాగా "ఏం చెప్పను? దానికి చాలా కథవుంది" అప్రయత్నంగానే అనేసేడు.

నరసింహం సులభంగా నవ్వి, "అట్లా చెప్పండి. అన్నట్లు నా పుస్తకాలు తీసుకుపోతాను....మీ యింటివైపు నడవండి" అన్నాడు.

కొద్దిక్షణాలు మౌనంగా ఆలోచిస్తూనే నడుస్తూ. వుండుండి తలెత్తి నరసింహం కళ్ళల్లోకి చూస్తూ, "వాడంత సిల్లీగా ప్రవర్తిస్తాడని తెలిస్తే నే నసలు కథే వ్రాసి వుండేవాడిని కాదు." చెప్పేడు లక్ష్మణరావు.

"ఏం కథ వ్రాసేరేం ?"

"క్రిందటివారం....పత్రికలో పడింది చూడండి—అదే! అప్పటి నించీ నాతో మాట్లాడటం మానేసేడు. ఈ విషయం మళ్ళీ ఎవరి తోటీ అనకండి....ఇప్పటికే గోలగా వుంది."

"అబ్బే! నాకెందుకు. అయితే అది అతనిని గురించేనా ? నేనూ చదివేనే....నాకేమీ అట్లా అన్పించలేదు. కథగా చాలా బాగుందికూడాను."

లక్ష్మణరావుకు అంత విచారంలోను, వక్కక్షణం హృదయం ఆనందంతో నింపి గుబగుబ లాడింది.

వెంటనే ఏదో గుర్తుకొచ్చి, తిరిగి బాధపడుతూ లక్ష్మణరావు అడిగేడు. "మీరీ సంగతి వాడితో అన్నారుట కూడాను."

"అవును, అన్నాను. కాని నాకేంతెల్సు మీరు ఆతనిమీదే కథ వ్రాసేరని! 'కథ బావుంది చదవండి' అన్నాను మాటవరసకి."

"కథ రాసినందుకు అతను ఉడుక్కోలేదు, మీరంతా యిట్లా అన్నారని."

నరసింహం చిత్రంగా చూస్తూ, "అంతా ఎవరు?" అన్నాడు.

"ఇంకెవరెవరో కన్పించి 'కథ చదివేవోయి....బాగా రాసేడు' అన్నారుట. దానితో వాడికి ఆవేశం ముంచుకొచ్చి ఘాటయిన ఉత్తరం వకటి రాసేడు—రేపటినుంచీ తనతో మాట్లాడనక్కర లేదని."

"బాగున్నదంటే వుడుక్కోవడ మెందుకండీ? ఆ మాత్రానికే బడి పిల్లల్లాగ మాట్లాడుకోవడం మానెయ్యాలా! సిల్లీ!"

"ఇదివరకు ఎన్నిసార్లు వ్రాయలేదండి! ఎప్పుడూ నవ్వి ఊరుకునేవాడు. లేకపోతే నవ్వుతూనే, 'నామీద కథలు రాసుకొని బతుకుతావేరా?' అనేవాడు. కాని ఇంత సీరియస్‌గా ఎప్పుడూ అనలేదు."

"అంటే నామూలానే మీ స్నేహం చెడిందంటారు. అంతేనా?"

"అబ్బే! నే నన్నానా ఆమాట."

"లేకపోతే మీరు కథ రాయడం బాగానే వుంది. అతను కోపగించుకొని మీకు ఉత్తరం రాయడం అంతకంటె బాగుంది. మధ్యన కారణం నేనా మీ బాధలకి."

"మీరు పొరబడుతున్నారు—నన్ను పూర్తిగా చెప్పనీయకుండానే"

"అయితే కానీండి! వక్కవిషయం—అతను సులభంగా యిట్లా తలక్రిందులయ్యే మనిషి గాదని నాకు తెలుసు. ఇంతకీ ఉత్తరం ఏమని రాసేడు?"

"చెబుతాగా, చాలా ఘాటుగా రాసేడులెండి ఉత్తరం మట్టుకు. నేను ఎన్నడూ కలలోకూడా అనుకోని అభాండాలు నా నెత్తిన పారేసేడు."

"ఊ."

"తర్వాత; నేనెప్పుడో అన్న ముక్కని పట్టుకొని వంచి వదిలి పెట్టేడు."

"ఏమన్నారు ?"

"వాడి పాత్ర చిత్రణలో కాస్త ద్రోహం జరగటంవల్ల కథ ఉన్నతంగా రాలేదని నేను అన్నానని."

"అన్నారా ఏమిటి కొంపదీసి."

"అనని స్తేనా నన్ను. నేను చెప్పేది పూర్తిగా వినకుండానే— వాడు కంక్లూజన్‌కి వచ్చేసి మాట్లాడితే నేను యేం చెప్పేది ?"

"తర్వాతయినా మీరు అనబోయేదేమిటో చెప్పలేదూ ;"

"ఉద్రేకంలో విచేస్థితిలో ఉంటేనా ? వాడిష్టం వచ్చినట్లు అనుకో నిమ్మని ఊరుకున్నా. ఇప్పుడు అది పట్టుకుని వాదిస్తున్నారు."

"పోనిస్తురూ .... చిన్న కుర్రాళ్ళలాగ ఏమిటీ దెబ్బలాటలు ?" అన్నాడు నరసింహం సిగరెట్ ముట్టించుకుని.

"చాలా తేలికగా అనేసేరు మీరు. నేనూ మొదట్లో సులువుగా సరిపెట్టుకున్నాను - పోనిస్తూ అని. కాని వాడి ఉత్తరంలోని కొన్ని వాక్యాలు కత్తులవలె గుచ్చుకుంటున్నాయి. ఇన్నాళ్ళు స్నేహం చేసికూడా వాడు నన్ను అర్థం చేసుకోలేదంటే నాకేమో బాధగా వుంటుంది "

"ఏమన్నాడేం ?"

"ఏమన్నాడా ? మరోడయితే వాడు అన్న మాటలకు ఆత్మహత్య తీసుకు తీరతాడు, నేనా ముక్కలను వాడు వ్రాసినంత నిశితంగా తిరిగి చెప్పలేదనుకుంటా. ఉత్తరం చూపిస్తా....మీరే చూడండి."

నరసింహం మౌనంగా కుర్చీలో చతికిలపడ్డాడు....బల్లమీది తన పుస్తకాలను ఏరి తీసుకుంటూ. లక్ష్మణరావు అలమారులోని ఉత్తరం తీసి నరసింహం ముందు పడేసి 'చూడండి' అన్నాడు. తను మరో కుర్చీలో చేర్లపడి.

నరసింహం ఉత్తరాన్నంతా జాగ్రత్తగా చదివి బల్లపైన పడవేసి, 'బాగానేవుంది' అని మాత్రం అన్నాడు.

"ఏం బాగానే వుంది? నాకు వాడేదో ఋణపడివున్నాడనే ధైర్యంతో నేనీ కథ వ్రాసే సాహసానికి ఒడిగట్టేననడం ఘోరంగా లేదూ?"

"అంటే నీచమనా మీ అభిప్రాయం?" అడిగేడు నరసింహం.

"ఏమైనా అనండి."

"చాలా సహజంగానే వుంది ఘోరంగా ఏముంది?"

లక్ష్మణరావు తుపాకి శబ్దము విన్నట్లు సరిగా సద్దుకుని కూర్చున్నాడు, నరసింహం వైపు దీనంగా చూస్తూ, "అన్యాయంగా మాట్లాడుతున్నారు" అన్నాడు,

"మీ రతనిమీద ఎంతో సహజంగా కథ వ్రాయగా, అతను వక్క సహజమైన పని చేయగానే మీ రింత బాధ పడటంలో తెలివితేటలేమీ కన్పించడం లేదు"

"నా స్థితిలో మీరు వుంటే బాధపడనంటారా?" అడిగేడు లక్ష్మణరావు తన తెలివితేటలను వుపయోగించి, నరసింహం సానుభూతిని సంపాదించే సమయం వచ్చిందనుకొని.

"నేనా? నేనయితే వక్కనవ్వు గట్టిగా నవ్వేసి వుందును."

"ఏం?"

"మన బలహీనత అవతలవాడికి కన్పిస్తే మనం బాధపడతాము. అవతలివాడి బలహీనతను మనం చూచి నవ్వేస్తాము. ఇక్కడ జరిగింది కూడా అంతే. అతని బలహీనతల్ని, సద్గుణాలని కలిపి కథ రాసి ఆనందించేరు మీరు. మీ బలహీనతని గురిచూచి దెబ్బ కొట్టేటప్పటికి మీరు

గిజగిజలాడి పోతున్నారు. మరి అతను నవ్వుకుంటున్నాడో లేదోగాని, నాకు మాత్రం నవ్వొస్తోంది."

"అన్యాయం."

"ఏమీకాదు. నేనే మీ స్థానంలో వుంటే మర్నాడే అతనిని పలకరించి వుండేవాడిని."

"కాని యీ ఘోరమైన నింద—వాడు నాకు కృతజ్ఞుడుగదా అని నేను సాహసించి యీకథ వ్రాసేననడం....నన్నింతగా బాధపెడ్తూంటే-"

"మీరు అనవరంగా బాధపడ్తున్నారు. అది ఏ సహాయమన్నా కానీండి — మీరు చేసిన సహాయానికి అతను నిజంగా చాలా ఋణపడేవున్నాడు. అతని వుత్తరమే చెబుతోంది ఆ సంగతి. ఆ కృతజ్ఞతా భారానికి కృంగిపోతూన్న అతను-ఎట్లా వదల్చుకుందామా యీ భారాన్ని అని ఆరాటపడుతూండగా యీ కద రావడం జరిగింది. భారంతో కృంగిపోతున్న వాడేం చేస్తాడు? మొట్టమొదటి అవకాశం రాగానే ఎటువంటి అవకాశమైనాసరే-ఆ భారాన్ని విసిరి అవతల పారేస్తాడు. అతని విషయంలోకూడా అదే జరిగింది....ఇంకేం చెప్పను?"

"నిజం?" ఆశ్చర్యంగా లక్ష్మణరావు.

"నిజమే. ఇంకా బాధపడ్తున్నారా మీరు?"

లక్ష్మణరావు ముఖం వికసించింది. చిరునవ్వుతో జవాబు చెప్పేడతను. అబ్బే లేదు. కాని, అతనిమీద జాలేస్తుంది యిప్పుడు."

నరసింహం విరగబడి నవ్వసాగాడు ఆకస్మికంగా.

లక్ష్మణరావు తెల్లబోయి, వెర్రిగా అతనిని చూస్తూ "ఏమిటి" అన్నాడు.

నరసింహం నవ్వును ఆపుకొని "జాలిపడాల్సింది, అతనిమీద వారుకాదు మీపైన నేను!

"అదేమిటి?"

"ఏముంది! సెన్సిటివ్ గనుక, బాధపడి అతడు పుత్తరం ఆ మాదిరిగా రాసేడంటే అర్థముంది. అన్నీ తెలుసనుకునే మీరు, నిష్కారణంగా నాలుగు దినాలు ఆ వక్కమాటకి బాధపడ్డారంటే, మీపైన జాలి పడటం అనవసర మంటారా?"

లక్ష్మణరావు ఏదో ఆలోచిస్తూ అట్లాగే కూర్చుండిపోయేడు—నరసింహం పుస్తకాలు తీసుకుని వెళ్ళిపోతూన్నది గమనించికూడా.

# 'సరిగమ'లు

ఫ్రదేశ్ళకి యిది మొదటిసారి నరసింహారావు యింత పరధ్యా నంలో పడటం.

"హుజూర్" అంటూ, వెనకనుంచి 'ప్యూన్' కేకవేసి తను బల్లపైన మరచిపోయిన సిగరట్ పాకెట్ అందించేడు. నరసింహారావు సిగరెట్ పాకెట్‌ను అందుకుని, ఏమీ జరగనట్లే, పేంట్ జేబులో చేతిని పెట్టుకుని బయటవున్న తోటలోకివచ్చి నిలబడ్డాడు. పేల్చివేసే ఎండ వెనకనుంచి షర్టులోదూరి, యింకా వీపును కాలుస్తూనే వుంది. పరిచిత మైన దబ్బచెట్ల మీదనుంచి వచ్చే సువాసనకి, అతని ముక్కు పుటాలు కొద్దిగా కదుల్తున్నాయి.

ముప్ఫయి అయిదేళ్ళే అయినా, యాభయి సంవత్సరాల వ్యక్తిలా అవుపిస్తున్నా డతను—ఆ పచ్చటి బ్యాక్‌గ్రౌండ్‌లో, అతని ముఖంపైన ఏర్పడ్డ ముడతలు వయస్సువల్ల వచ్చినవి కావని, మానసికమైన వ్యథ వల్ల వచ్చినవని ఎవరైనా తేలికగా గ్రహించవచ్చు.

నెమ్మదిగా కదిలి, గేటును తీసుకుని బయటకు నడిచే డతను. గేటును దాటి, మధ్యమధ్య కన్పించే పనివాళ్ళ 'సలాం'లు అందుకుంటూ అడ్డతోవను ఆఫీసరు — బంగళావైపు నడిచే డతను.

తెలుసు. తనకు బాగాతెలుసు. ఏదో కొత్తప్లాను విషయం మాట్లా డటానికి కబురు పంపించేడు తన ఆఫీసరు- మళ్ళీ అదే! అనుకుంటూ బంగళాగేటు చేరే డతను.

బంగళా తలుపు తీయకుండానే 'సలాం' ఒకటి పారేసేడు అక్కడ నిలబడివున్న, జవాన్ పరేశ్.

"ఖులాసాయేనా పరేశ్! దొరగారేం చేస్తున్నారు?"

"మీ దయవల్ల కులాసాయే బాబూజీ! తమకోసమే చూస్తున్నారు. దయచేయండి." గేటు తలుపు తీసేడు.

పరేశ్ భుజాన్ని తట్టి, చిరునవ్వుతో బంగళాలోకి నడిచేడు నరసింహారావు.

తన ఆఫీసర్ చీఫ్ యింజనీర్, సిగార్‌ను పీలుస్తూ, సావధానంగా వాలు కుర్చీలో కూర్చుని వున్నాడు ఎదురుంగా బల్లపైన ఏవో ఫైళ్ళు, ప్లానులు పడివున్నాయి.

కుశల ప్రశ్నలు, భోజన పానాదుల వ్యవహారం, కాలక్షేపం మొదలైన విషయాలను గురించి చాలా తాపీగా, సరసంగా అడుగుతున్నాడు తన ఆఫీసరు ఘోషాల్.

నరసింహారావుకి ఎంతోసేపు పట్టలేదు, యిందులో ఏదో కిటుకు వున్నదనే విషయం గ్రహించేసరికి. ఏదో ప్లాన్‌ను గురించిగాని, ఫైలును గురించిగాని కాదు తన విక్కడికి రమ్మని ఘోషాల్ కబురంపించింది-వేరే ఏదో వుండివుండాలి.

తనకంటె వయస్సుకు చిన్నవాడైనా గొప్ప హోదాలోకి వచ్చిన ఘోషాల్‌వైపు వింతగా, మొదటిసారి చూస్తూన్నట్లు చూస్తూ నిలబడి పోయేడు నరసింహారావు.

"కూర్చో—నిలబడే వున్నావేం?" అన్నాడు ఘోషాల్, వెను వెంటనే కూర్చోమని సంజ్ఞ చేస్తూ.

తానింకా కూర్చోకుండానే ఘోషాల్ సూటిగా తనని కబురంపిన వ్యవహారంలోకి దిగేడు. దిగబోతూ చెప్పేడు. 'మొన్నీమధ్య నేను మద్రాసు ఆఫీసర్ల కాన్ఫరెన్సుకి వెళ్ళినప్పుడు, మద్రాసు ఆఫీసరు చెప్పేడు 'ఒక తెలివైన, శ్రమపడి పనిచేసే ఆఫీసర్నెవర్నన్నా మావైపు పంపమని.' నిజానికి వాళ్ళలో తెలివైన వాళ్ళున్నారు గాని, నడుములు వంచి పనిచేసేవాళ్ళు తక్కువ. నువ్వు అటువైపు వెళితే బావుంటుందని నా అభిప్రాయం."

"కలకత్తా వదిలెయ్య మంటారు-అంతేనా?" అన్నాడతను. అతని స్వరంలో ఏధ్వనీ లేదు. గాలి వొత్తిడికి వెలువడిన మాటలవి.

"మీ స్వదేశంకూడా దగ్గరేగా అక్కడికి. పాపం, ఇంపై ఏళ్ళవలా నువ్వు మీదేశం వదలి?

"పది" దద్దేడతను.

"పోనీ పదేళ్ళు తక్కువకాలం కాదు-ఒక్కసారి కూడా వెళ్ళి చూసిరానివాళ్ళకి."

నిజమే. తను వొక్కసారి వెళ్ళలేదు తను పేరాలకి. పదేళ్ళు! తనదేశం!

కొత్తబ్లేడ్ మీద పడ్డ కిరణంలా, ఘోషాల్ పెదాలమీద చిరునవ్వు చిందులు తొక్కుతూంది. ఇద్దరూ వక్క క్షణంపాటు వకరి ముఖాలు మరొకరు చూసుకుంటూ వుండిపోయేరు. సంవత్సరాల తరబడి పరిచయం వున్నా వకళ్ళ నొకళ్ళు అర్థం చేసుకోడం ఎంత కష్టం—అనుకున్నాడు. తనమీద ఆకస్మికంగా అపారమైన దయ చూపుతున్న ఘోషాల్‌ను గురించి నరసింహారావు. కాని అద్దరు అర్దరే. తన కిష్టమైనా, కాకపోయినా సరే. కాగా అన్నాడతను "ఎప్పుడు వెళ్లాల్సి వుంటుందో, నేను?"

అందంగా చేతిని వూపుతూ ఘోషాల్ అన్నాడు. "ఇందులో బలవంతం ఏమీలేదు. నీకు ఇష్టమైతేనే నిన్ను పంపడం. నమ్మకమైన వాడవు గనక నీకు చెప్పుతున్నా. ఇప్పు డిక్కడ పనిచేసే అరవ యువకుల్లో గంతేసి ఎవరైనా వెళ్తారు. వెళ్ళమంటే! ఆలోచించుకునే చెప్పు. రెండు, మూడు వారాలు చాలదూ, నీ ప్రయాణానికి వ్యవధి?"

"అట్లాగే, ఆలోచించి చెబుతానండీ. బయలుదేరేట్లయితే వారం లోనే బయలు దేరుతాను."

ఘోషాల్ గారి బంగాళా వదలి నెమ్మదిగా బయటకు నడచి వస్తూన్న నరసింహారావుకు చెవిలో వెనకనుంచి బంగళాలోని పచ్చిచెట్లు

ఏదో రహస్యాలను పూదుతూ, తనని సుషుప్తావస్థ నుంచి జాగ్రదవస్థకు తెస్తూన్నట్లు అర్పించ సాగింది.

• • • •

అతనికేమీ ఆశ్చర్యంగా లేదు. తెనుగువాళ్ళు గాని, మరే జాతి వారు గాని యీ మూలనుంచి ఆ మూలకు పోవడం. అనేకమంది బతి - మాలి, కోరి, స్వస్థలాలకు దగ్గరలో వుండేట్లు ట్రాన్స్ఫర్ల ఆర్డర్లు వేయించుకుంటారు. తనని పిల్చి అడగటమా? ఆయన 'స్వంత' మోహ ర్పానికి అవొచ్చు. లేకపోతే ఏ ఆఫీసరుకో చేసిన వాగ్దానం నెరవేర్చుకో డానికి అవొచ్చు. లేకపోతే....తనిక్కడ దిక్కులేక దేశం కాని దేశంలో చచ్చిపోతాడేమోనని భయమా?

తన వరండాలో చల్లగాలిలో వంటరిగా కూర్చుని, నురగవలె గచ్చుమీద పడుతూన్న వెన్నెలను చూస్తూ ఆలోచిస్తున్న నరసింహారావు తన అరచేతిని చూసుకున్నాడు. తెల్లగా పాలిపోయివుంది చెయ్యి. వేళ్ళ వైపు చూచుకున్నాడతను. పూచీపుల్లల్లా. బలహీనంగా ముట్టుకుంటే విరిగిపోయేట్లున్నాయి అవి. ఇంకా రక్తం పట్టలేదు తనకి.

నరసింహారావు ఆరునెలల క్రితం జబ్బుపడటం నిజమే. చాలా జబ్బుచేసింది. డాక్టర్లుకూడా తికమకపడ్డారు. సరిగ్గా నాలుగేళ్ళ క్రితం వచ్చిన జబ్బు వంటిదే యిది అన్నారు. అదృష్టవశాత్తూ తను లేచి మళ్ళీ నలుగురి మొహాలూ చూడగలిగేడు. తిరిగి ప్లానులను గురించి, బ్రిడ్జీలను గురించి బుర్ర పగులగొట్టుకోసాగేడు. తనేమవు తాడోనని భయమా, లేక తెలుగువాళ్ళు వుండటం యిష్టంలేకా? అబ్బే, రెండో కారణం మాత్రం కాదు. యిన్నాళ్ళనుంచి అందరూ తనతో అన్నదమ్ముల్లా వుండటం లేదూ యీ కాని దేశంలో. అసహ్యమే అయితే, తనే రాజీ నామా యిచ్చి మరోచోట ఉద్యోగానికి చేరతాడు. కాని మళ్ళీ మొదలవు తుంది కాబోలు, టెంపరరీ అనీ, ట్రయలు పీరెడ్ అనీ, చాలీచాలని జీతంతో....

వెనువెంటనే సుశీల, పిల్లలు గుర్తుకొచ్చేరు అతనికి. తలదిమ్ముగా వున్నట్లనిపించింది అతనికి-ఆకస్మికంగా లేచి వరండాలోంచి కిందకొచ్చి తోటముందు పచారు చేయసాగేడతను.

తనసలు సుశీలను దేనికి పెళ్ళి చేసుకున్నాడో స్ఫురణకి తెచ్చుకుందామని ప్రయత్నించ సాగేడు నరసింహారావు. ఒకప్పు డామెలో వున్న అందం, సొగసు, నాజూకు, తర్వాత తనకి బాగా గుర్తున్న సుశీలలో మచ్చుకైనా లేకుండా పోయినవి అవును. సునళిని పుట్టడంతోనే బ్లాటింగ్ వేసి అద్దినట్లు యింకిపోయేయి అన్నీను. 'రోగలు, ఒంటరి తనం, తలనొప్పి, ఎండలు' అని ఎప్పుడూ నణిగే సుశీల మిగిలింది ఆఖరికి. ఎన్నో యుగాలయినట్లని పిస్తుంది ఆ సుశీలను తను ఎరిగి. ప్రతీ చిన్న విషయం ఆమెకి కుతూహలం కల్గించేది. పరిచయమున్న వాళ్ళందర్ని గురించీ ఎన్నెన్నో విషయాలు తనని అడిగి తెల్సుకునేది. ఇంటికి రాగానే తను రోజూ ఏమేం చేస్తున్నాడో, చెప్పి తీరాల్సిందే. రోడ్డు చివర తను కన్పించగనే చిన్నపిల్లలా చప్పట్లు చరుస్తూ గుమ్మం వద్ద తనని కల్సుకుని, చెయ్యి పట్టుకుని ఏమేమో చెబుతూ, లోపలికి నడిపించేది.

తర్వాత సుదర్శనం పుట్టేడు. ఆపేక్షకోసం ఆటమటిస్తూ, ఆమె ఆ దినాన తన చేతుల్ని నిమరడం మెరపులా గుర్తుకు వచ్చింది అతనికి. ఆ దినానే ఆడవాళ్లు మాట్లాడుతూండే 'ప్రేమ' అనే మాటకి అర్థం కనుక్కున్నాడాతను. 'ప్రేమ' అంటే వాళ్ళ వుద్దేశంలో పిల్లలు అవి మాత్రమే !

అట్లాగే ! బోలెడుప్రేమ ! ముగ్గురు పిల్లలు వర్సగా. ఈ పిల్లలు చాలు ఆమెకి కావలసినంత పని కల్పించడానికి, తనని మరచిపోడానికీ నని అనుకున్నాడు తను. కాని, అయినదానికీ కానిదానికీ ఆమె అనవసరమైన హడావడి చేయసాగింది. దీనితోబాటు నిష్కారణంగా చిరాకు పడటం, మాటకి మాట బదులు చెప్పడం, పెంకితనం చూపడం మొద

లైన గుణాలు బయటుదేరాయి ఆమెలో. ఎన్నైనా సహించగలిగేదు తను, పక్క- పెంకితనాన్ని మినహాయించి!

ఆఖరికుర్రాడు పుట్టక ముందునుంచే బయలుదేరింది మునలం. ఆమెకు స్వస్థలం పైకి మనసుపోయింది! "బయలుదేరుదాం, సెలవు తీసుకోండి" అని ప్రారంభించింది. నాయిగేళ్ళు నా అనేవాళ్ళని చూడ కుండానా అని వాదం మొదలెట్టింది.

"అవును, పాపం! బిందెలుచ్చుకుని పంపులకి వెళ్ళడంలేదనీ, పేరంటాలకు వచ్చే ముత్తయిదులు లేరనీ చాలా బాధగావుంది కాబోలు" అన్నాడుతను. "అపుననుకోండి, కాని నే నెంత వంటరిగా—యిన్నాళ్లి నా అనే వాళ్ళని చూడకుండా ఎంత అవస్థపడుతున్నానో తెలిస్తే—"

"పిల్లలున్నారుగా," అన్నాడుతను.

ఒక విధమైన నిస్పృహ ఆమె ముఖంలోకి ఎగబ్రాకింది చిక్క-గా నీడలాగ. వాళ్ళనిగురించే యీ నా బాధంతా. ఒక్క-సారీ స్వస్థలం చూచుకోకుండా, కాందిశీకుల్లా యిలా .... సెలవుకు ప్రయత్నించండీ, కాస్త."

"చూద్దాం" అన్నాడు తను; సెలవుకు ప్రయత్నించనేలేదు తను. తనకి అక్కడ ఏముందని సెలవుపెట్టి వెళ్లేందుకు? ముఖం ఎదట స్తోత్రాలు వల్లించి, వెనకాలే అక్షతలుచల్లే బంధుమిత్రులేగా! కొంచెం లోపముంటేచాలు కాకుల్లా పొడవడానికి సిద్ధమయ్యే బంధుమిత్రులేగా. స్వస్థలంమీద ప్రేమా....ఎంతవుంటేనేం....అక్క-డవుండే మనుష్యుల మాట?

మూడేళ్లు గడిచేయి. తను వకసారి మంచమెక్కి- తిరిగి కోల్కొ- న్నాడు. పనిలో శ్రద్ధచూప సాగుతున్నాడు కూడాను. మళ్ళీ అడిగిందొక సారి ఆమె సెలవు సంగతి. చూద్దాంలే అన్నాడు తను యధాప్రకారంగా! ఆమె ముఖం కందగడ్డలా యెరుపెక్కి-పోయింది.

"మీ రొచ్చినా రాకపోయినా నేను వెడుతున్నా పిల్లలతో. ఏమైనా డబ్బు పడెయ్యండి." ఏమీ మాట్లాడలేకపోయాడు తను. లేని చిరునవ్వు

తెచ్చుకుని అట్లాగే యిచ్చేదు పైకాన్ని. పైకం తీసుకుని మర్నాడే ఆమె బండీ ఎక్కింది. బండి కదలబోయేముందు తనచేతిని ఆమె అరచేతుల్ని వెచ్చగా నొక్కుతూ "సెలవు తీసుకొని వెంటనే వకసారి వస్తారుకదూ॰" అంది. బండి కదులుతూవుంది. తనకి తెలుసు ఏంచెప్పాలో. తలవూపేడు అట్లాగే నన్నట్లు.

ఇప్పుడు చాలా హాయిగా వుంది ప్రాణం। కావలసినంత శాంతి.... ఆమెవద్దనుంచి వుత్తరాలు రాకుండా వున్న దినాన, వారానికి వకటిచొప్పున మొదట్లో వొస్తూండేవి. ఏముంటాయి వుత్తరాల్లో. సునళిని స్కూల్లోకి వెడుతూందని, సుదర్శనానికి జలుబు చేసిందనీ, మీకింకా సెలవు దొరకనేలేదా అనీ. తనూ ఏదో వ్రాసేవాడు జవాబు-యిదిగో వస్తోంది సెలవు అంటూ. ఈమధ్య తనసలే మానేసేడు వ్రాయడం రెండు నెలలయినా అయివుంటుంది తను వుత్తరంవ్రాసి. ఆమె వుత్తరాలు వచ్చిన దినం తనెంత వంటరో గుర్తుకొచ్చి, ఏదో అవ్యక్తమయిన బాధ వ్యాపిస్తుంది నరనరాలా.

చీకట్లు మబ్బుల్లా దొర్లుకొస్తున్నాయి. కూర్చున్న స్థలంనుంచిలేచి సిగరెట్ వకటి కాల్చుకుంటూ యింటిలోపలికి నడిచేడతను. లెటర్‌పాడ్ తీసుకుని భార్యకి వుత్తరం వ్రాయసాగేడు... వారం దినాల్లో ట్రాన్స్‌ఫరయి వస్తూన్నట్లు.

ఉత్తరాన్ని పూర్తిచేసి కవరులోపెట్టి బల్లపైన పెట్టి, తాపీగా సిగరెట్ పొగను పీలుస్తున్న నరసింహారావుకు సుశీల చిరాకు, పెంకెతనం, సణుగుడు గుర్తుకు రాసాగినయి

బయటనుంచి వేసే చలిగాలి సహచారిణిని గుర్తుకు తెస్తూంది.

వ్రాసిన కవరును ముక్కలు ముక్కలుగా చింపేసి, మరో సిగరెట్టును కాల్చసాగేడు నరసింహారావు. ఆ క్షణంలోనే ఇంజినీర్‌కు చెప్ప వలసిన సమాధానం కూడా నిశ్చయించుకున్నాడతను।

# తీరని కోరిక

ఓరవాకిలిగా వేసి వున్నగది తలుపు ఆకస్మికంగా తెరుచుకుంది. తల ఎత్తిచూచే. నైరాశ్యం చిందుతూన్న ముఖంతో నిలబడి వున్నది అమ్మ....జాలిగా చూస్తూ.

ఎందుకూ అట్లా చూస్తుంది అమ్మ ? ముఖంలో ఆ బాధదేనికి ? జాలిగా— శిఖరాగ్రంనుంచి జారిపోతున్నమానవునివైపు చూచినట్లు అట్లా చూస్తుంది ఎందుకు అమ్మ !

అనగలిగేను "అమ్మా" అని.

వెంటనే నాలో ఒకప్రశ్న సుందరిని చూచిందా అమ్మ ? లేదు. తలుపు త్రోసిన చప్పుడుకే పుట్టెడు సిగ్గుతో సుందరి కర్టెను ప్రక్కకు అదృశ్యమయింది.

నావంకే యింకా అట్లాగే చూస్తూవుంది అమ్మ. నాముఖంవంకే పరిశీలనగా చూస్తూవుంది అమ్మ.

ఎందుకు అమ్మ అట్లా చూస్తూంది నావంక ? ఏంతప్పు చేశానని అట్లా కండ్లలో జాలిని నింపుకొని నావంక చూస్తుంది అమ్మ !

కదిలింది అమ్మ ! కదిలేయి అమ్మ కండ్లలోని నీళ్ళు. కదిలేయి అమ్మ పెదవులు—తడబడే పదాలతో.

అన్నది అమ్మ "బా-బూ !"

ఏమిటా స్వరంలోని వేదన ! ఎందుకా స్వరంలో వొణుకు ?

నేను కూర్చునివున్న మంచము వద్దనే నిలబడింది అమ్మ. రెండు చేతులను ముందుకు జాపి నా ముఖాన్ని పైకి ఎత్తుతూంది. నిశ్శబ్దంగా కండ్లలోకి చూస్తూ—దేనికోసమో అగాధంలో వెతుకుతూన్నట్లు వెతు

కుతూ, నా హృదయాన్ని మథిస్తూంది. వంచుకున్నా తలను, అమ్మ కండ్లలోని వెలుగును చూడలేక. అడిగింది అమ్మ—వంచుకున్న తలను ఎత్తుతూ "అట్లా చిక్కిపోతున్నావేం నాన్నా ?" అమ్మ కండ్లలోకి చూడగలిగే. చూడగలిగే అమ్మ కండ్లలో నిల్చివున్న రెండే—రెండు ముత్యాలను.

చిక్కిపోతూన్నది ఎవరు ? నేనా ? నేను ! చూచుకున్నా జబ్బల వయిపు ఓసారి. ఒకసారి ఛాతీవెయిపు చూచుకున్నా.

వూరుకోక అడిగేను, "ఎవరమ్మా చిక్కిపోతున్నది ?"

కౌగలించుకుని మరీ అంది అమ్మ. "నువ్వే పిచ్చి ! నువ్వే!" నన్ను ముద్దుపెట్టుకుని మరీ అంది "నువ్వేనాన్నా. తీరని మనోవ్యధతో చిక్కి శల్యమైపోతున్నావని నాకు తెల్సు. కాని అదేమిటో నాకు చెప్పవూ ? చెప్పు....నాన్నా...." వెచ్చటి బాష్పకణాలు వణికించేయి భుజాలను.

మనోవ్యాధి .... నాకా ? నాకు తెలియకుండానే నాకు వ్యాధా ? విచిత్రం !

నవ్వబోయే అట్టహాసంగా వెలువడింది హీనంగా బయటకు నా నవ్వు. అయినా అన్నాను. "నాకేమమ్మా. భోజనం చేస్తున్నా శుభ్రంగా, పడుకుంటున్నా శుభ్రంగా, నాకేం రోగం ?"

ముఖాన్ని పైకెత్తి కండ్లలోకి చూచింది అమ్మ. తీక్షణంగా నా కండ్లలోకి చూచింది అమ్మ,చూచి అన్నది. "ఏదీ ఆ మాట తిరిగి అను. వింటాను."

నిలబడిపోయే స్థబ్దులా. నిలబడిపోయిన నా నోట మాటే రాలేదు.

"నేను శుభ్రంగా వున్నాను." అందామని లోపల ఆరాటం ! .

అమ్మ అన్నది "నాకు తెలుసు నాన్నా ! నువ్వు ఎందుకో గుండెలను నములుకుంటూ అలా వంటరిగా ఎప్పుడూ గదిలో కూర్చుంటూ

వుంటే....హాయిగా వున్నావని ఎవరు మాత్రం అంటారు ? నాకు తెలుసు అది మానసిక బాధ అని. కాని ఎందుకూ అంటా....అది ! చెప్పవూ.... నాతో చెప్పవూ ?"

"అబ్బ. అట్టే విసిగించకమ్మా. నా కేమీ లేదంటూంటే వినవేం?."

అమ్మ కండ్లను తుడుచుకుంది. గుండె నిబ్బరం చేసుకుని లేచి ముందుకు రెండడుగులు వేసింది. ఇక బయటకు వెళుతుంది గాబోలు !

తటాలున వెనుకకు తిరిగి ఆగి "అన్నమయినా సరిగా తినవు. నిద్రపోవు. మనోవ్యాధి కాక మరేమిటది? చెప్పవూ?" అన్నది.

"ఏమీలేదంటూంటే.... అబ్బబ్బా...." తలబాదుకున్నా.

ముఖంమీద కొట్టినట్లు బాధపడుతూ, అమ్మ బయటకు నడిచింది. గదిలోంచి, నన్ను కన్న అమ్మ బాధతో బయటకు నడిచింది.

అంత కటువుగా ఎందుకు మాట్లాడే ? అమ్మ హృదయాన్ని ఎందుకు అట్లా నొప్పించే ! పరితాప పడుతూన్నా.

అంతా అట్లాగే అంటున్నారు. మిత్రులూ, బంధువులూ, అదే మాటను అంటున్నారు. ఆఖరికి అమ్మ కూడా అదే....! నిజంగా నేను చిక్కి శల్యమై పోతున్నానా ? నిజంగా నేను మనోవ్యాధితో బాధపడుతున్నానా ?

ఎట్లా చెప్పేది-నిజాన్ని వీళ్ళందరికీ ! నేను బాధపడటం లేదనీ, ఆనందాన్ని అనుభవిస్తున్నాననీ వీళ్ళకు ఏమని చెబితే తెలుస్తుంది ? స్వర్గ సౌఖ్యాన్ని నేను అనుభవిస్తున్నానని చెబితే నమ్మగలరా వీళ్ళు !

• • • •

ఆ దినాల్లో మనస్సును మరోవిషయం మీద నిలపడానికి చేతిలో పనే వుండేదిగాదు. అందగత్తెలను చూడటానికి 'గ్రాండుట్రంకు ఎక్స్ ప్రెస్' వద్ద హాజరవడం, ఎక్కడ మీటింగులు వుంటే అక్కడకు ఎగబడటం, రోడ్లమీద వెర్రివాడిలా తిరగడం యిదే దినచర్య ఆ దినాల్లో

నిలబడి వుంది మేడమీదఆమె! నిలబడి కురుల నారబెట్టు కుంటూంది ఆమె! కురుల నారబెట్టుకుంటూ తన సౌందర్యాన్ని వెదజల్లు తూంది ఆమె!

ఎవరామె? హృదయ మొక్కసారిగా ఉక్కిరి బిక్కిరయిపో యింది. ఎవరామె! చేయిజాపు దూరంలో....లావణ్యరాసి! ఎన్నిదినాల నుంచీ యిక్కడ-యీ మాసందులోనే వుంటూంది?

స్తబ్దుగా అట్లాగే రోడ్డుమీద నిలబడ్డా! ఏమనుకుందో ఆమె నా మొరటు ప్రవర్తనకు? సిగ్గుపడుతూ. అడుగులు ముందుకు వేసే — తలను వంచుకుని. మారాం చేస్తూంది హృదయం. పక్కసారి తలనెత్తి ఆమెను చూడనీయమని. ముందుకు నడిచే....హృదయాన్ని గట్టిగా అణచుకుంటూ!

ఎంతసేపో....ఎన్ని అడుగులో! తల ఎత్తేసరికి స్వగృహాన్ని దాటి పది అడుగుల దూరంలోవున్నా. వెనక్కి తిరిగి లెక్క పెట్టుకుని పది అడుగులు ముందుకువేసి, తలఎత్తి సౌందర్య దేవత నిలయంపైపు ఆశాదృక్కులు బరపే. వారి మేడకూ, మా డాబాకు మధ్యన వున్న సుబ్బారావుగారి మేడ వెకిలిగా చూస్తూంది—అడ్డుగా నిలబడి!

ఆ క్షణానే తెల్సుకున్నా నేను పూర్వపు 'నేను' కాదని. ఆ క్షణాన్నే నిశ్చయించుకున్నా....యిక ఎప్పుడూ నేను పూర్వపు 'నేను'ను కారాదని.

లాలించి చెల్లెలును అడిగే...."ఎవరేమిటి?" "మనవాళ్లే. దూరపు చుట్టాలుట" అని చెప్పింది చెల్లెలు.

"ఆహాఁ!"

"సుందరి 'యింటరు' ప్యాసయ్యింది. పెళ్ళికాలే యింకాను."

"నిజంగా!"

"నిజం! వాళ్ళ నాన్నగారు వోవరుసీలు...."

"బాగుంది, ఇంకా, ...."

"నీ కథలన్నీ చదివేసింది సుందరి. ఎంతో బాగున్నాయంది."

"ఏమిటీ ? నాకథలు చదివిందీ ? నేను రాస్తానని ఎట్లాతెల్సో ?"

"ఏం ? మానేస్తం అది, నేనే చెప్పే ! తప్పా ?"

"తప్పెందుకు ? రైటే. ఇకపోయి....కాస్త ఆడుకుందూ....

గిలగిలలాడింది మనస్సు—పెంకి గుర్రంలా ! వెంటనే పరుగెత్తుకుపోయి, ఆమె అక్కడే నిలబడివుందేమో చూచివస్తే ? మనస్సును జుట్టు పట్టుకులాగి, నిలబెట్టే. ఎందుకూ వెళ్ళడం ?

వంటరిగా గదిలో కూర్చుని, ఆలోచించసాగే, ఆలోచనలు.... ఆనాటినుంచే ప్రారంభం, అంతూ దరీ లేని ఆలోచనలు ఆనాటినుంచే ప్రారంభం !

ఆమెను చూద్దామనే ఎప్పుడూ నా కోరిక. ఆమెతో మాట్లాడదామనే నా వుబలాటం. ఆమెతో కలసి మెలసి తిరుగుదామనే నా గాఢ వాంఛ. ఇవి తప్పితే మరో కోరికలే లేవు నాకు.

చిన్నప్పటినుంచీ యిదే కోరిక—ఆడపిల్లలతో మాటాడాలని, ఆడుకోవాలనీను. కాని ఆ రోజుల్లో ఆడవాళ్ళతో మాట్లాడ్డం అగుపిస్తే చాలు—బడిపంతులు చావతన్నేవాడు ఆడపిల్లలతో స్నేహంచేస్తే చాలు బడిపిల్లలు 'లేవిడే' కొట్టి ఏడిపించేవారు. ఆడపిల్లల జోలికి వెడితేచాలు-"ఛీ సిగ్గులేదూ ! ఆడవాళ్ళ జోలి కెందుకుపోతావ్ ?" అని కసిరేది అమ్మ.

గడిచిపోయేయి ఆడవాసన లేకుండానే హైస్కూలు దినాలు. గడచిపోయేయి అట్లానే 'కాలేజ' దినాలు. మిగిలిపోయినవల్లా చిన్ననాటి తీరని కోరికలే !

మనస్సుకెప్పుడూ ఆమెను గురించిన ఆలోచనలే ! ఆలోచనల కెప్పుడూ ఆమే మధ్యబిందువు. ఆలోచనా శక్తి, ప్రోత్సాహం, ఆణచ

అశక్తుడయినప్పుడల్లా ఆ పచ్చమేడముందుకు నడిచేవాడిని. మేడను సమీ పించేవరకూ తల ఎత్తుకునే నడిచేవాడిని. గుమ్మంలోగాని, మేడమీదగాని ఆమె వుండటం అగుపిస్తే—వుక్కిరి బిక్కిరయి పోయినట్లు అనుభూ తిని పొందుతూ, తల వంచేసుకుని తప్పుపని చేస్తూన్నవాడిలా బాధ పడుతూ వెళ్ళేవాడిని ముందుకు. ఆమె దర్శనం లభించకపోతే, వ్యధ జెందుతూ, ఏ కిటికీ కంతలోనుండి అయినా అగుపించకపోతుందా అనే ఆశతో కళ్ళు చిందులు తొక్కుతూ ప్రతి అంగుళాన్నీ పరిశీలించేవి. నిరాశతో ప్రక్క సందులోంచే యింటికి తిరిగివచ్చి, కన్నీళ్ళు కారుస్తూ.... గడిపేవాడిని....కాలాన్ని.

గడచిపోతున్నాయి యిట్లానే....వారాలు.... నెలలు! గడచిపో తూంది యిట్లానే నా జీవితంలో 24 వ సంవత్సరం.

ఒకనా డెపుడో, ఎక్కడెక్కడో తిరిగి తిరిగి రాత్రి ఎనిమిది గంటల కిల్లుచేరే. చేరుకుంటూనే, ఎక్కడనుంచో రోదన ధ్వనులు వెలు వడుతూండటం విన్నా, అడుగు గుమ్మంలో వేసేసరికి ముఖము వేల వేసుకుని అమ్మ అగుపించింది. నా పుస్తకాలతో ఓపరుసీరుగారి చంటి పిల్లలు....ఆటలాడుతున్నారు.

జలజలా కన్నీరు కారుస్తూ, రుద్ధకంఠంతో అమ్మ అన్నది. "సుందరి పోయిందిరా....బాబూ!"

విశ్చేష్టుడనయిపోయే. కుర్రాడిలా భోరున ఏడుస్తానేమోనని.... హృదయాంతరాళంలో....సన్నని అనుమానం

మూగగా అమ్మవైపే చూస్తూ నిలబడిపోయే. నిజమేనా? పొర పాటు విన్నానా? అమ్మ యింకా మాట్లాడదేం? ఎదురుచూస్తూ—అమ్మ మాటలకోసం ఎదురుచూస్తూ, నిలబడేవున్నా అట్లానే.

"మాయచావు దానికే రావాలా? బంగారపు బొమ్మ....అయ్యో.... అయ్యో....ఎంతకర్మరా! ఆ తలిదండ్రుల దుఃఖానికి అంతుఅంటూ

వుందిరా యిక ? మాయజబ్బు అదేం జబ్బో. గుండె వక్కసారి యిట్టే ఆగిపోయింది !"

కళ్ళవెంబడి నీళ్లే రాలేదు నాకు, కాని గుండెల్ని మాత్రం....ఏదో జంతువు నమిలివేస్తున్నట్టు....భరింపరాని బాధ....శరీరాన్నంతా కంపింప జేస్తూంది.

"సూర్యాస్తమయం తర్వాత శవాన్ని తీసుకుపోరాదట. అక్కడి కోసారి వెళ్ళిరా. వాళ్ళు వక్కళ్ళూ ఏమి యిదయిపోతున్నారో....పాపం" అన్నది అమ్మ.

నడిచేను బయటకు. నడుస్తూనే చెట్టుచాటున కండ్లు తుడుచు కున్నా....అనుమానంతో.

సుందరి! రోడ్డుప్రక్క, వరుపుమీద సుందరి! తాత్కాలికంగా వెలసిన పందిరికింద సుందరి!

తలవద్ద వొక చమురుదీపం, తలపైన పెట్రొమాక్సు దీపంతో పోటీచేస్తూంది.

గుండెలు అవిసేట్లుగా ఏడుస్తున్నారు సుందరి తలిదండ్రులు. వారిని ఓదార్చ యత్నిస్తూంది మా అమ్మమ్మ—మధ్య మధ్య తనూ వారిని అనుసరిస్తూ. నాన్నగారు మాత్రం ఎడంగా నిలబడివున్నారు.

నిలబడేవున్నాను నేను. కళకళలాడుతూన్న సుందరి వదనాన్నే చూస్తూ నిలబడేవున్నా నేను. చిరునవ్వు విప్పుకుంటూన్న ఆ పెదవుల వైపు ధైర్యంగా చూచా. అలాగే నిలబడిపోయేను ఎంతసేపో.... ఏమో?

ఏమేమో ఆలోచిస్తున్నా. ఏమేమో ఎవరెవరికో సమాధానా లిస్తున్నా. ఏమేమో చూస్తున్నా. ఎంతసేపో....ఏమో?

ఎవరెవరో వస్తున్నారు. ఎవరెవరో వెళ్ళుతున్నారు. ఎవరెవరో ఏడుస్తున్నారు .... ఎవరెవరో ఏమేమో మాటాడుకుంటున్నారు. ఎంత సేపో. .ఏమో.... ?....నిలబడేవున్నా. సుందరివైపే చూస్తూ నిలబడే

వున్నా, సుందరిని గురించే ఆలోచిస్తూ నిలబడేవున్నా. నేటికి సుందరి వద్ద ధైర్యంగా!

ఎంత సేపటికో నునుసిగ్గు దొంతరులు కెరటాల్లా చిమ్ముకుంటూ నవ్వింది. నవ్వి మొట్ట మొదటసారిగా అంది నాతో "ఎందుకు అట్లా చూస్తావ్?"

ఏంచెప్పేది నేను? గుర్తులే.చెప్పేను ఏదో సమాధానం మాత్రం. ఆనందంలో తేలిపోతూ చెప్పేను ఏదో — గుర్తులేనిదేదో. దానితోటే కరిగిపోయేయి నాలోని భయసందేహాలు. దానితోటే కరగిపోయింది, నాలోని అసహజ లజ్జకూడాను. ఆమె ఏదో అన్నది తిరిగి. సమాధాన మిచ్చే, వెంటనే ఏదో.

నవ్వుకున్నాం; యిద్దరమూ నవ్వుకున్నాం. దిక్కులు ప్రతిధ్వనించేట్టు నవ్వుకుని లేచేం. లేచి, నడిచేం కాలువవైపు.నడుస్తూనే హృదయాలను విప్పుకున్నాం. విప్పుకుని ప్రపంచానికి కప్పేం గట్టి దుప్పటిని.

ఆరంభమయింది.ఆనాటి నుంచే ఆరంభమయింది సుందరితో నా మధుర జీవనం. ఆ దినాన్నుంచే కల్సుకుంటున్నాం, యిద్దరమూ ప్రతి దినమూ నవ్వుకుంటున్నాం. యిద్దరమూ ప్రతి దినమూ మాటాడుకుంటున్నాం, ఆలోచించుకుంటున్నాం, జీవిస్తున్నాం.

దుఃఖ మెరుగను నేనాదినాన్నుంచీ. విచారాన్ని అసలే ఎరుగను ఆ దినాన్నుంచీ.

అమ్మ అంటూంటుంది అయినాగాని, "చిక్కిపోతున్నావేంరా? మనోవ్యాధేంరా?" అని.

ఏమని చెబితే అర్థమవుతుంది అమ్మకు, ఏమని చెబితే అర్థమవుతుంది ప్రపంచానికి—నాకు ఏజబ్బూ లేదనీ—నాకే కోరికలూ యిక లేవనీ!

# ము ఖా రి

కలకు యదార్ధానికీ మధ్యవున్న దూరమెంతోగాని ఇన్నేళ్ళ తర్వాత కూడా ఆనాటి సంగతులు కళ్ళకి గట్టినట్లు యదార్ధంలా అపుపిస్తాయి; తన వూహాలు కల్లలయి పోయినా!

అది ఒక సోమవారం కాలేజీ. ఆదివారపు సెలవు బడలిక యింకా పూర్తిగా మాయం కాలేదు. అట్లాగే యిష్టం లేకపోయినా బడికి వెళ్ళాడు తను. మొదటి పీరిడ్ అవుతుండగా ఆమె వచ్చింది తెల్లటి గౌనుతో, చంకను పుస్తకాల బొత్తితో. ఆ సెక్షన్‌లో కల్లా ఆ కొత్తగా వచ్చిన అమ్మాయి ఒక్కతే ఆడపిల్ల. తెలుగు మేష్టారు వేరే బెంచీ వేయించి ఆ అమ్మాయిని ఒక్కర్తెనూ తనకు ఒక గజం దూరంలో ఎడంగా కూర్చోపెట్టారు.

ఆ సాయంత్రం తను యింటికి వెళుతున్నాడు. ఆ అమ్మాయి అటే వస్తూంది. బహూశా ఆమె యిల్లు కూడా యిటువైపేనేమో? పరుగెత్తుకొని వచ్చి తనను కల్సుకుని అడిగిందామె. "నువ్వూ మా క్లాసే కదూ?" "అవును" "ఎక్కడ మీ ఇల్లు?"

"చర్చికి ఎదురుంగా మేడ లేదూ అది - మా నాన్నగారు తాసిల్దారు"

"మా యిల్లూ అక్కడే. సాయంత్రం ఆడుకుంటానికి వస్తావ్? ఎంచక్కా మైదానంలో మేమంతా ఆడుకుంటాము" అడిగాడు తను ఆశగా ఆమె ముఖం చూస్తూ. గాలికి ఎగిరే ముంగురుల్ని ఒక చేత్తో వెనక్కి తోసుకుంటూ ఆమె చెప్పింది. 'ఇవ్వాళ సాయంత్రం సంగీతం మేష్టారు వస్తారు. రేపటినుంచీ ఆయన్ని పొద్దున్నే రమ్మంటాను. చాలా మంది వస్తారేం—మైదానంకి ఆడుకోటానికి'? ఆటలంటే ఎరగనట్లు అడిగింది.

'రేపు నువ్వే చూస్తావు. ఎంచక్కా వచ్చాక, చెడుగుడు బోలెడు ఆటలాడుతాం. ఇదే మాయిల్లు రేపు తప్పకుండా వస్తానేం.'

అదీ ప్రారంభం ఆమె పరిచయం. మొదటి ఫారంలో తన చదువంతా ఆమెకంటె ఎక్కువ మార్కులు సంపాదించుకోవాలనే కాంక్షతోనే గడిచిపోయింది. విరామ సమయాలు ఆమెను సంతోషింప జెయ్యాలనే ఆకాంక్షతో వెళ్లిపోయాయి.

సునంద చాక్లెట్లు తెచ్చుకుంటే 'యిదిగో అమ్మ యిచ్చింది రాజా! తినవూ, మా బాబువికదూ," అని బ్రతిమిలాడి లాలించి తినిపించేది. ఆమె అట్లా అడగడం తను బెట్టు చెయ్యడం బ్రతిమాలించుకోడం అదో ఆనందం తనకు. తనుకూడా అట్లాగే ఏమైనా తెచ్చి ఆమెను బ్రతిమాలేవాడు. బుజ్జగించేవాడు. ఆఖరికి ఆమె నోటిని పట్టుకుని బలవంతంగా ఆ చాక్లెట్ను ఆమె నోట్లో కుక్కేశాడు. ఆమె పకపకా నవ్వుతూ చప్పరించ సాగేది ఆ చాక్లెట్, 'మరినీకో' అంటూనే. ఇద్దరూ ఒకరిని వదిలి మరొక్కరు ఒక్క క్షణం వుండలేనట్లు అనిపించేది.

వేసంగి సెలవులిచ్చేరు. యిష్టంలేకపోయినా తను అమ్మతో అమ్మమ్మగారి బయలుదేరాడు. వూరు-సునంద తనూవస్తానని గంతులేసింది. అమ్మ 'మీ అమ్మను అడిగిరా అమ్మా.' అని పంపించింది సునందను. మరితిరిగి రాలేదామె. తను, అమ్మ, మామయ్య బండిలో, వెడుతుంటే ఆమె గుమ్మంలో నుంచుని గుడ్లనీరు కనిపించనీయకుండా నవ్వాలని ప్రయత్నిస్తూ చెయ్యి వూపుతోంది. తనకి ఏడుపు వచ్చినట్లయింది. ఎందుకు రాకూడదో సునంద కూడా ?

దాదాపు మూడు నెలల తర్వాత కాబోలు తిరిగి వచ్చాడు తను. తిన్నగా బండీ దిగంగానే వాళ్ళింటికి పరుగెత్తాడు. కొత్త జవాను ఎవరో వున్నారు బయట. లోపలికి పరుగెడుతూంటే ఎవరు జవానాపి 'ఎవరికోసం?' అన్నాడు. "సునంద" "సునంద ఎవరు? ఎవరూ లేరే."

"తాసీల్దార్‌గారి అమ్మాయి" "తాసీల్దార్‌గారికి ట్రాన్స్‌ఫరయి వెళ్ళిపోయి నెలరోజులయింది. ఇందులో సబ్‌కలెక్టర్‌గా రుంటున్నారు."

ఏంచెయ్యాలి తనింక. సునంద లేనిదే తను యింకేమి ఆడుకు నేది? "ఎక్కడు వెళ్ళేరువాళ్ళు?" అడిగాడతను. "ఎమో మాకేం తెల్సు....? ఏదో ఆ వాల్టేరు సైడుట." వెనక్కి తిరిగాడుతను. అమ్మని అడిగాడు, స్నేహితులని అడిగాడు తను, "ఏమో, ఏమో!" "పోనిద్దూ గోల!" 'ఇక అదే పిచ్చి!' యిదీ సమాధానం.

ఆమెను చూడాలి. ఎక్కడున్నా సరే చూడాలి. ఒక్కసారి కల్సు కుంటే....ఆమెను. ఎట్లాగైనా——? ఎట్లా? సునంద....సునందా!

* * * *

"సునందా....సునందా!" హీనంగా అరిచాడతను. వెనకనుంచి నర్సువచ్చి ముఖంపై చెయ్యివేసి అంది "ఉష్! కొంచెంసేపు మాట్లాడకు. అట్లాగే పడుకో."

మత్తు వదలిపోతూండగా, నెమ్మదిగా కళ్లు తెరుస్తూ."ఎన్నాళ్ళకు." ఆగిపోయాడతను.

తిరిగి కళ్ళు మూసుకుంటూ నర్సు చేతిని తన ముఖంనుంచి దూరంగా తీసుకుని లోపల అనుకున్నాడు 'సునంద కాదు.'

నర్సు చిన్న నిట్టూర్పు విడిచి, ఆపరేటింగ్ థియేటర్ బయట కొచ్చి నిలబడి వినీలాకాసం పైపోసాని చూచి భుజమొకసారి ఎగరవేసి పక్క గదిలోకి తిరిగి వెళ్ళిపోయింది.

అతను తిరిగి కండ్లు తెరిచాడు. ఒళ్ళంతా బద్ధకంతో మూలుగు తున్నట్లుంది. పైకి చూచాడు; దేదీప్యమానంగా పెద్ద ఆర్క్‌లైట్ వెలుగు తోంది చుట్టూ చూచాడు; తెల్లటి ఎత్తైన గోడలుచుట్టూను. కండ్లకు తిన్నగా గాజు తలుపులు. గాజు తలుపులలోంచి తెల్లగా మల్లెపువ్వల్లా

వున్న బట్టలతో వక రిద్దరు నర్సులు అటూ ఇటూ కంగారుగా తిరుగు తున్నారు. ఎక్కడతను? చెయ్యి లాగుతున్నట్లుందేం? ఎక్కడి కట్లా లాగేస్తుంది! ఎత్తబోయాడతను తన చేతిని. పైకి లేపదేం? ముందుకు లేచి కూచున్నాడు. చేతికి చెక్కలతో కట్టు వుందేం? భగవాన్ తన చెయ్యి విరిగినట్లుంది! ఎవరో విరగకొట్టేరు....తన చేతిని! "అమ్మా...."

నర్సు గబగబావచ్చి అడిగింది. "ఏం ఎట్లావుంది?" హాస్పటలా ఇది? వెంటనే గుర్తు కొచ్చింది తనకు—మేడమీదనుంచి తను క్రిందకు జారడం.

బాధతో మూలుగుతూ "ఏం లేదు, యీ చెయ్యి విరిగినట్లేనా?" అడిగాడాతను....నెమ్మదిగా నర్సును ఆసరాగా చేసుకుని లేస్తూ.

ఆమె అతని వెనకాలే నడుస్తూ, వార్డు బయటవున్న వరండాలోని మంచాన్ని చూపించి "మరేం ఫర్వాలేదు అన్నాడు పెద్దదొర. ఆపరేషన్ పవ్యంగా జరిగింది కనక ఏంఫర్వాలేదు. హాయిగా పడుకో, ఏ ఆలోచనలు లేకుండా....అన్నట్లు సునంద అన్నావు. నీ భార్యా?" చిరునవ్వుతో అడిగిందామె.

అతను పరుపుపైన నెమ్మదిగా పరుండి అడిగాడు "సునంద అన్నానా? ఏ సునంద? అన్నాను."

"ఏసునంద? ఎందరున్నారేం?"

నాలిక కొరుక్కుని అన్నాడు "ఆ! నా భార్యే. యింకేమైనా అన్నానా?"

"సునందా అని అరేచేవు అంతే...." వెళ్ళిపోయింది ఆమె, ప్రోత్సాహంగా తన కుడిచేతిని ఓ నొక్కునొక్కి.

చలించనట్లు, కండ్లు మూసుకున్నాడతను. 'సునందా' అని తను అన్నాడా? భార్యనెన్నడూ ఆ పేరు పెట్టి పిలిచే అలవాటులేదు తనకి. ఎన్నాళ్ళకు గట్టిగా తన స్నేహితురాలివి....పిలువగల్గాడతను. ఇప్పుడు

ఆలోచిస్తూంటే ఎన్నాళ్ళ క్రితమో అనిపిస్తుంది....కలకు యదార్థానికి మధ్య వున్న దూరమెంతోగాని ఇన్నేళ్ళ తర్వాతకూడా ఆనాటి సంగతులు కళ్ళకి కట్టినట్లు యదార్ధంలా అవుపిస్తాయి....తన వూహాలు కల్లలయి పోయినా....

* * * *

కలలు....ఘోరమైన కలలు! తన జీవితమే మహా విషాదమయిన కల అయిపోయింది. వూహాలు కల్లలవడాని కేంవచ్చే! 'కల'....'కల్ల'.., ఎంత సామీప్యమో! సునందా? సునంద! ఎంతాదూరమో? ఎన్ని లోయలో! ఒక్కచుక్కలో ఎంత చేదో....ఎంత విషమో!

'విషంత్రాగుతాన'న్నాడు. తను ఇప్పుడు పెళ్ళి చేసుకోనంటే. తనతండ్రి. చాలా గౌరవస్తులట అవతలివారు. తాము కానట్లు. చాలా గొప్పవారుట - తమలాగే. బంగారపు బొమ్మట అమ్మాయి - అవొచ్చు. పదివేలకట్నం యిస్తారుట - భలేమంచి చౌకబేరమూ! "నీ పరీక్ష లయ్యాకే చేసుకుందుగాని!" ఆశే?

"పసేమిరా, వీలుకాదు. నాకు పెళ్ళి చేసుకోవాలని యిప్పుడేం వుబలాటంలేదు. నా పరీక్షలన్నీ అయ్యి, చదువు పూర్తిఅయి, వుద్యోగం చేసుకుంటున్నప్పుడు నేను చేసుకుంటా! ఇప్పటినుంచీ నాకీబంధాలు అనవసరం నాన్నా" అన్నాడు తను బహు నెమ్మదిగా.

"కాదురా, ఆ అమ్మాయిని నువుకూడా చూడరా. నీకు నచ్చితేనే చేసుకో. అమ్మమ్మ, అమ్మ, అన్నయ్య చూసి వచ్చారు. బంగారపు బొమ్మట!"

"అవొచ్చు నాన్నా! కాని చదువు పూర్తయితేనేగాని...."

"పెళ్ళాం వొచ్చి చదువుకోవద్దంటుందిరా! యిష్టం వచ్చినంత వరకు చదువుకో. యీ ఏటితో బి. ఏ. అయిపోతుందా? నీకు కావాలనుంటే బి. యస్.సి కూడా వెళ్ళు. మీ మామగారితో చెప్పి మీ ఆవిడే ఆ పని చేయించగల సమర్థురాలు...."

"నాన్నా—"

"నీ యిష్టం యిహ. యీ కుర్రాళ్ళతో నాచావు వచ్చిపడింది— మధ్య. నేను పెద్దవాడినవుతున్నానా. రేపో ఎల్లుండో 'హరీ' అంటాను, ఇహ మీ ఏడుపు మీది. ఉన్నంత వరకే యీ జంయీూటం." కళ్ళనమ్మట నీళ్ళు తిరిగేయి ఆయనకు.

"అదికాదు నాన్నా...."

"ఏదయినా కానీరా అబ్బీ ! మంచి సంబంధం. నువ్వుకూడా పోయి చూచుకో. నీకు వాళ్ళ సునంద నచ్చుతుందనే ధీమాతోటే మాట కూడా నిక్కచ్చిగా యిచ్చివచ్చాను." 'సునందా!' అన్నాడతను ఆశ్చర్యంగా ?" ఆ ! సునంద. అమ్మ వాళ్ళు చూశారా అమ్మాయిని, చక్కగా వుందన్నారు. గౌరవస్థులు, గొప్పవాడు. బంగారపుబొమ్మ ! పదివేల కట్నం నీ పరీక్షలయ్యేకే చేసుకుందుగాని....ఇక అవీయిదీ కాదంటావా ఏదో యింతవిషం తాగి నేను పరువు దక్కించుకుంటాను. నీ యిష్టం యిక" ముగించాడాయన.

నిలబడ్డాడతను మౌనంగా !

మౌనంగా ఆలోచనలలో తేలిపోతూండగా తనబల్లపైన బ్రెడ్, పాలుపెట్టి 'వార్డుబాయ్' ప్రక్క వార్డులోకి వెళుతున్నాడు. నర్స్-యింకో నర్సు కిచకిచలాడుతూ 'టెంపరేచర్' తీసుకుంది. "కొద్దిగా టెంపరేచర్ వుంది. ఫర్వాలేదు" అంది 'ఛార్టు'లో మార్క్ చేస్తూ. నిమీలిత నేత్రాలతో నెమ్మదిగా గోడకు జేర్లబడి తల ఎగురవేశాడు అతను. "అట్లా మౌనంగా వున్నారేం ? బావుండలేదా మనస్సు." మాట్లాడకపోవడంచూచి కిచకిచ లాడుతూ ప్రక్క 'బెడ్'వద్దకు వెళ్ళిపోయిందామె.

"మౌనం" అని లోలోపలే గొణుక్కుంటూ పాలు త్రాగసాగే డతను. రెండు గుటకలేసి సహించక బల్లమీద పెట్టేశాడు పాలగ్లాసును, తిరిగి గోడకు జేర్లబడుతూ "మౌనం....మౌనం కాక ఏమి మిగిలింది?

శూన్యంఅంటే ఎంతో, 'మౌనం' అన్నా అంతే. శూన్యం, చీకటి, మౌనం....పర్యాయపదాలు! ముఖ్యంగా ఆ 'మౌనం'....

మౌనంతోనే ప్రారంభమయ్యింది విషాదగీతం.ఆగీతానికి వెలుగు లేదు. అంతంలేదు. అక్కడేవుంది గొప్పతనం,

బుట్టలో ఎత్తుకునివచ్చి పీటలవద్ద బుట్టనుదించి చేతులు విదిలించు కున్నాడు మేనమామ. మౌనంగా తల వంచుకునివున్న ఆమెను ఎట్లాగో వీలుచేసుకుని చూడగలిగాడు తను మొట్టమొదటిసారిగా.

భగవాన్! తన సునందకాదు, తను వూహించిన, ఆశించిన ఆసునందకాదు: ఎక్కడో ఏదో తెగిపోయినట్లయ్యింది!

మౌనంగా ఆమె తన కుర్చీ వెనక నిలబడివుంది. ఎదురుగా టేబుల్ పైన ఏవేవో రకరకాల తీపుబండారాలు, పాలు, మంచినీళ్ళు. చుట్టూ అగరవత్తులు: గదినిండా మౌనం. తలఎత్తి వెనకకు తిరిగాడు అతను, ఆమె వకసారి తలఎత్తి వెంటనే సిగ్గుతో క్రుంగిపోతున్నట్లు తల దించుకుంది.

గదినిండా 80 కాండిల్సు పవర్. హృదయంనిండా చీకటి. వెయ్యి అమవశల్ని మైమరపించే చీకటి!

'బంగారపుబొమ్మ', 'చక్కటి చుక్క', 'చిదిపిన దీపం' యివన్నీ అవొచ్చు కాని తన సునందకాదీమె! ఎంత బేధం? ఆమె అనాకారి కాకపోయినా తన మనస్సు ఆమెను అంగీకరించకపోయింది. భగవాన్, ఎంత చీకటి పగలుకూడా!

మౌనంగా పిధికి తల వొగ్గేరు యిరువురూ! వాతావరణం మరింత ప్రబలంగా నీడల్ని, బొగ్గును, కారు నలుపును పులుముకుంది.

కాని మనస్సు వట్టి మృగం తన శరీరవాంఛలకి వున్న బుద్ధి, తిన్నటిచూపు, తన మనస్సుకు లేదు మనస్సు గడ్డిపోచను పట్టుకుని ఏదో 'మధురస్మృతులు' 'దివ్యక్షణాలు,' అంటూ తుచ్ఛసుఖాలను, కామే

చ్చును విసరి తంతానంటుంది. 'శరీరవాంఛలు' అంటాయి, "పోవోయి, చాలామందిని చూచాము." అని పెనుగులాడతయ్. మధ్య తను హతమారి పోతున్నాడు. చాలా దినాలు మనస్సేకళ్ళెములను పట్టుకుంది.

కళ్ళెములను పట్టుకోవడమంటే అట్లా యిట్లా కాదు. శరీరమంతా వుడికెత్తిపోవాలి. నాలిక ఎండిపోవాలి. దవడలు చీరుకుపోవాలి. ప్రవాహమవ్వాలి చెమటలతో వళ్ళంతా. ఒకటే వేగం.... మెరుపు వేగం, సూర్యకిరణవేగం, వెనకపడాలి దాని వేగం ముందు. సరిగ్గా గమ్యస్థానం ముందే ఆగడం. పారవశ్యం, ఆనందం, ప్రణయగేయాలు, చుంబనాలు, విహారాలు ; అదీ, కళ్ళెం, మనస్సు చేతికివస్తే. ఇంకా....

ఆమె - తన భార్య మామూలు మనిషి. అనాకారికాదు! కాదయ్యా. చూడ్డానికన్నా ఆహ్లాదంగా వుండొద్దూ. వుండదు మరి! ఏంచేసేది ? మైకేలేంజిలో చిత్రాలు. తన కళాపిపాస, తన సౌందర్యారాధన చచ్చిందా? తగలేసేడా ? ఇంతలోనే నాశనం అయిపోయిందా ?

ఈమెతో ఒకే యింట్లో, ఒకే గదిలో, ఒకే మంచంపైన ఎట్లా వుండేది ? ఆచేతి అన్నం, పులుసు, కూరలు ఎట్లా తినేది ? ఎన్నాళ్ళిట్లా యీ చీకటి గదుల్లో, యీ చీకటి మనస్సులతో, ఎన్నాళ్ళిట్లా? చీకటిలో మౌనంగా, భారంగా క్రుంగడమేనా ? లక్ష్యం—నీలక్ష్యం, పసిపూసిన మారేడుకాయా ?

కళ్ళెము శరీరవాంఛలకు చిక్కితే ముళ్ళల్లోంచి, మురికి కూపాల లోంచి, కొండలనుంచి వాగుల్లోకి ఒకటేదౌడు. ఒకటే హెచ్చరిక.... ఒకటే హెచ్చరిక !

అందము అంటే ? కళ్ళకి ఆహ్లాదంగా వుండేది అందమా ? మనస్సుతో చూడటం నేర్చుకో. చాలా బాగుపడుతుంది. నీ శరీర స్వాస్థ్యము, అన్నిటికంటె ఆత్మ సౌందర్యము బహుదొడ్డదని వినలేదూ? ఆదర్శాలు, బాల్యస్మృతులు గడ్డిపరకలు. శారీరకంగా గడ్డిపోచలత వుపకరించవు. చీకటిలో అన్నీ ఒకటే. చీకటిలో చూడటం నేర్చుకో. అదే ఆదర్శం ! అదే లక్ష్యం.

మానవులకు జీవిత పరిమితి బహు తక్కువ. ఉన్న నాలుగు దినాల్లోనూ యిన్ని జుంఝూటాలు పనికిరావు. ఈ యవ్వనంలోనే వర దాలు, వాంఛలు అన్నీ తీర్చుకోవాలి. కళ, కళోపాసన మొదలైన వేషాలు చేతగాని వాళ్ళకి. నీకేం దిగులు, మాంచి యవ్వనంలో వున్న భార్య—బోలెడు ఆస్తి. రాట్నాన్ని వదిలి చంద్రుణ్ని పట్టుకో ప్రయత్నిస్తున్నావు. అదేం లాభంలేదు బాబ్ ! ప్రపంచంలోకెల్లా గొప్ప వస్తువు చీకటి. చీకట్లో చూడటం అలవాటు పడవోయి. అలవాటు పడు.

మౌనం, చీకటి, మురికి కాల్వలు, దోమలు వాంఛలూ - యిటు. వేడి, వెల్తురు, ప్రణయ గేయాలు, వెన్నెల పందెరలు, పూపొదలు-రహస్యాలు అటు !

తను B. A. ప్యాసయి ప్రైవేటు పరంలో జేరదం. మేనేజరవ్వడం అంతా అరేళ్ళయ్యింది. ఈఆరేళ్ళలోనూ యిద్దరు ఆడపల్లలు తనకు.

ఈ ఆరేళ్ళలోనూ ఎన్ని అసహ్యాలు, ఎన్ని ఏడుపులు ఎన్ని చావులు.

ఈ ఆరేళ్ళలోనూ ఎంత స్నేహం. ఎంత ప్రేమ. ఎన్ని గేయాలు.

పదహారు గంటల క్రితమేగా వెన్నెల కొండలప్రక్క నున్న వుద్యానవనంలో, సమీపంలోవి సెలయేళ్ళ సంగీతంలో సునందతో నృత్యం చేస్తూ చేస్తూ...............

'Good Morning Mr. Raz! ఎట్లా వున్నావ్.' అడిగాడు డాక్టర్.

ఉలిక్కిపడి కళ్లు తెరచి అతనన్నాడు 'ఫర్వాలేదు సర్. బాగానే వుంది. కొంచెం నెప్పి తప్పితే'

'ఆల్‌రైట్. అదేతగ్గిపోతుందిక' వెళ్ళిపోయాడు డాక్టరు.

నెమ్మది నెమ్మదిగా నీడలు మాయ మవుతుండగా కళ్ళు మూసుకుని ప్రక్కకు ప్రాలేడు అతను. నిట్టూరుస్తూ గాఢమైన చీకటి బ్లాటింగు పైనా సిరాలాగ నెమ్మదిగా దళసరిగా వెచ్చగా చుట్టుకుంది అతని చుట్టూను—తర్వాత లోపలాను.

# సౌందర్యోపాసకుడు

నిత్యము వెళ్లినట్లే ఆ దినముకూడా నేనూ, కేశవరావు క్రిష్ణ వద్దకు వెళ్ళేము. మసక చీకటి పడుతూండగా, కదలలేక వదలలేక క్రిష్ణను వదలి యింటిముఖం పట్టేము. నేనేదో ఆఫీసు కాగితాల సంగతి గుర్తుకొస్తే, వాటినిగురించే ఆలోచిస్తూ, పరధ్యానంగ కేశవరావు చెప్పే దానికి 'ఊ'కొడుతూ నడుస్తున్నాను. కేశవరావు క్రిష్ణానది సౌందర్యాన్ని రకరకాలుగా వర్ణిస్తూ వుద్రేకంగా ఏమేమో మాట్లాడుతున్నాడు.

చాలా విచిత్రమైన వ్యక్తి కేశవుడు. వయస్సు యిరవై రెండు యినా, పద్దెనిమిదేళ్ల కుర్రాడిలా అపుపిస్తాండు. ఎంత అమాయకం గానూ మాట్లాడుతాడు. చాలామంది మిత్రులు అది గర్వం అనుకున్నా, ఏమిటో చాలావరకు అతి ముభావంగా వుండటం అందరితోను. అతనిలోని బలహీనమైన విషయం ఏమిటంటే 'కళ'ను గురించి ప్రసక్తి వస్తే మాత్రం వళ్ళు తెలియకుండా గంటలకొలది మాట్లాడటమే. అతనితో నా పరిచయం రెండేళ్ళనుంచే అయినా, నాతో మాత్రం ఏదో యుగాల వెనకనుంచి సంబంధం వున్నట్లు ప్రవర్తిస్తా డతను. తాలూకా ఆఫీస్‌లో వుద్యోగానికి రాకపూర్వం అతనెవరో, నేనెవరో, మరి!

ఎదురుగా దూరంగా అవుపించే నల్లటి జీవితాల్లాంటి కొండ వయిపే చూస్తూ నడుస్తున్నాము యిద్దరమూ, కొండపయిన ఒంటరిగా ప్రకాశిస్తూన్న దీపాన్ని గురించి ప్రవాహంలో వున్న కట్టు కథలను కేశవరావు చెబుతున్నాడు. కల్పనా చాతుర్యానికి విరగబడి నవ్వుకుంటూ, ఎదురంగావచ్చి మీదపడబోయే రిక్షాలను తప్పించుకుంటూ, మళ్ళీ నవ్వు కుంటూ ముందుకు నడుస్తున్నాం యిద్దరమూ, నేను ఎరిగి వున్నంత వరకు సర్వకాల సర్వావస్థల్లో అతను ఎందుకో వకందుకు నవ్వుతూనే

వుంటాడు. ప్రతీది అతనికి విచిత్రమే. ఆనందదాయకమే. జీవితమంటే 'నవ్వే'నా అన్పిస్తుంటుంది అతన్ని చూస్తే. చింత అనేదిలేదా అతనికి అని ఆశ్చర్యపడుతూండేవాడిని కూడా అప్పుడప్పుడు.

ప్రక్కకి తప్పుకొని పోదలచుకున్న నా రిక్షా ఆకస్మికంగా ఆగిపోయింది. 'శ్రీవ్' అంటూ ముందున్న 'సూట్‌కేస్'ను, పరుపు చుట్టను 'బెడ్డింగ్'ను దాటి ముందుకు దూకేడు ఒక యువకుడు.

ఆకస్మికంగా మా నవ్వులు తెగిపోయినవి. కేశవరావు ఆశ్చర్యంగా చూడసాగేడాతనివైపే. ఆ యువకుడికి మహావుంటే పాతికేళ్ళు వుండవచ్చును. కొంచెము పొడుగు ముఖం, ఫ్రెంచికటింగ్ మీసాలు.

కేశవుడి చేతిని పట్టుకొని 'బ్రతికే వున్నావురా' అన్నాడతను. కేశవరావు ముఖం ఆనందంతో వికసించింది "ఏమిటీ అకాల సందర్శనం! పెట్టె బెడ్డింగ్‌తో ప్రత్యక్షమయ్యావు! మళ్ళీ వుద్యోగానికి వుద్వాసన చెప్పేవా?" అతని చేతుల్ని తన ముఖానికేసి రాసుకుంటూ....నవ్వుతూ అన్నాడు.

"అబ్బే! కాసింత ప్రాణసంకటంలే. నీ మకాం తెలియక హోటలుకు పోతున్నాను." చెప్పేడతను.

"మంచిపనిచేసేవు! అన్నట్టు మీవాడున్ని నీకు పరిచయంచేయలేదు కదూ. ఈమధ్య రచనల పత్రికలల్లో తరుచు చూస్తూనే వుంటావ్‌గాని, యీయన్ని కల్సుకొని వుండవు. శ్యామసుందరరావుగారూ వీడు నా బాల్య మిత్రుడు వెంకట్. జాలేసి వెంకట్రావని పిలుస్తుంటాము ప్రస్తుతం పోస్టాఫీసులో గుమాస్తా."

నమస్కరించబోతున్నా మధ్యలో అక్కడే నిలబడిపోయి విపరీతంగా నవ్వుకొనసాగేము ముగ్గురం. తర్వాత వెంకట్రావ్‌గారు నైజాం పరిస్థితులలో కమ్యూనిస్టులు చేస్తున్న ఘాతుక చర్యలను వివరిస్తూండగా వింటూ ముందుకు నడవసాగేను. ప్రత్యేక పరిశీలనకవసరంకంటె ముఖ్యమైంది కనుక ఎంతో కుతూహలంగా వింటూ కేశవుడి గదివరకు వెళ్ళి అక్కడనుంచి నేను సెలవ్ తీసుకుని యింటిముఖం పట్టేను.

కేశవరావు గత రెండేండ్లనుంచి మా ప్రక్క సందులోని పచ్చ మేడలోని పై గదిలో అద్దెకుంటూన్నాడు. ఎన్నోసార్లు అలనంటూ వుండేవాడు, ఆ గదిని మార్చి ఎలెక్ట్రిసిటీ వున్న గది ఏదైనా తీసుకోవాలని. కాని మార్చాలని ఒక్కసారికూడా గట్టి ప్రయత్నం ఏదీ అతను చేసినట్లు కన్పించేదికాదు మార్పుకు యిష్టమున్నా మార్పుకు తయారయి లేచి ప్రయత్నంచేయని వ్యక్తుల శ్రేణిలో ప్రథముడు కేశవుడు. పైగా ఆ గదిలోంచి చక్కగా కొండలు, అస్తమించే సూర్యుడు అపుపిస్తారని ఒక సంతృప్తి అతనికి.

నిత్యమూ ముగ్గురమూ సాయంత్రమో, ఉదయమో కలుస్తుంటూనే వుండేవాళ్ళము. వెంకట్రావ్ కూడా చాలా సరదా మనిషి కనుక చాలా వుత్సాహంగా గడిచిపోతూండేది కాలము. కాని నన్ను ఒక్కటే విషయం. వెంకట్రావ్ విసిరే విసుర్లన్నీ కేశవరావును గురిచూసి విసురుతున్నాడనే విషయం. బాధిస్తూండేది కేశవరావు ఒంటరి జీవితం యీ విసుర్లకి లక్ష్యం. పెళ్ళీ పెటాకులూ అన్నీ అక్కర్లేదా, బ్రహ్మచారిలా ఎక్కడో హోటలులో భోజనం చేయటం ఏమిటి? యిదీ వెంకట్రావ్ చెప్పే పొడుపుల సారాంశం.

నాకూ నిజమే అన్పించేది. అప్పుడు ఇదేం ఖర్మం అని నేనూ అనుకునేవాడిని, కాని కేశవుడు ఏమి బాధపడతాడో అని, వూరుకునే వాడిని. ఎవరు ఎన్ని అన్నా కేశవుడు మాత్రం చిర్నవ్వు ఒకటి వదలి వూరుకునేవాడు. అన్నిటికీ అదే సమాధానం. ఎంత బాధపడుతున్నా, చిరాకుపడినా చిర్నవ్వుమాత్రం అతన్ని వదిలేదికాదు.

ఎనిమిదవ దినం సాయంత్రం కాబోల్ను వెంకట్రావ్ అన్నాడు కేశవుడితో "ఇళ్ళకోసం వెదకాలి. పోయివద్దాంరా."

"మేం కృష్ణవడ్డున కూర్చుని వుంటాము. నువ్వుపోయి వెతుక్కోరా, బాబూ" చెప్పేడు కేశవుడు.

ఇంత నిర్మొగమాటమయిన జవాబువస్తుందని వెంకట్రావ్ అనుకోనట్లు అతని ముఖంలోని ఆశ్చర్యమే చెబుతోంది

కాగా వక్క క్షణం వింతగా కేశవుకివైపు చూచి అతను 'సరే' అంటూ వెళ్ళిపోయేడు. మేము నవ్వుకుంటూ క్రిష్ణవైపుకు నడిచేం.

మరుసటిరోజు వుదయం గదిలో కేశవుడు వక్కడూ'టాగూర్'ను మననం చేస్తూ నిమీలిత నేత్రాల్తో కూర్చుని వున్నాడు. 'వెంకట్రావ్ ఏడిరా' అన్నాను.

"ఇళ్లకోసంపోయేడు. వెధవది.... ఊళ్లో.... ఈరోజుల్లో మనకి ఇల్లిచ్చేదెవడ్రా పిచ్చిగాని· రెండేళ్ళనుంచీ వెతుకుతూంటే నాకు గదే దొరికించికాదుగాని,"

విపరీతమైన నవ్వు వచ్చింది నాకు కేశవుడు విరగబడి నవ్వ సాగేడు. తాను అడిన గొప్ప అబద్ధం తెల్సుకున్నట్లు. ఇక నవ్వలేక వెళ్ళిపోయేను అక్కడినుంచి. వాడు నవ్వుతూనే తిరిగి 'టాగూర్'ను మననం చేయసాగేడు.

ఆ సాయంత్రం వెంకట్రావ్‌గాని, కేశవరావుగాని ఎవ్వరూ అవుపించలేదు నాకు. మర్నాడు కేశవుకు చెప్పేడు. వెంకట్రావు ఆఫీసు నుంచి తిన్నగా వాడివద్దకు ఎచ్చి బలవంతాన తనని లాక్కుపోయినట్లు. ఇళ్ళకోసం వంటరిగా తిరగడం ఎంత నీరసమయిన వ్యవహారమో అనుభవించిన నేను, వెంకట్రావ్ అవస్థకు జాలిమాత్రం పడగల్గేను.

సాయంత్రము మా ఆఫీసువద్ద కేశవుడు వక్కడే అవుపించేడు... కొంచెం ముందుగా. నేను ఆశ్చర్యపోతూ "ఏం....టైం అవకుండా వచ్చేపేవేం?" అన్నాను. అతను జాలిగా నవ్వుతూ "మళ్లీ అతనొచ్చి యిళ్ళకోసం తిప్పుతాడు. అతన్ని తప్పించుకునేందుకే నేను యిటు వచ్చేపేను" అన్నాడు.

క్రిష్ణవైపు దారితీస్తున్న నన్ను కేశవుడు ఆపి "ఈ పూటకు పార్కులో ఆ మూలకుపోయి కూర్చుందాం" అన్నాడు. "ఏం." అన్నాను. పార్కు అంటే యిష్టపడని కేశవుడు యివ్వేళ తనంతతనే పార్కుకు పోదాం అనడం చూచి.

అతను అదే అన్నట్లు తల ఎగురవేసేడు ఏమయింగా సలు మూలలా చూస్తూ. వెంకట్రావ్‌ను చూసి జాలిగా ఏడుస్తున్నట్లు వెంటనే గ్రహించగలిగేను. మాట్లాడక పాయ్యేసరికి నాది లీసేను

"సంగతి ఏమిటోయి, అట్లావున్నావు?" అడిగేను.

"మనస్సంతా ఏమిటో ఆందోళనగా వుంటోంది. ఈ వెంకట్రావ్ వకడు రోజూ నా ప్రాణాలు తినేస్తున్నాడు" అన్నాడతను.

'ఎందుకు? ఇల్లు వెతకడానికి సాయం చెయ్యమనమనేనా?'

"అదొకటే అయితే పర్వాలేదు. నేనెందుకు యిట్లా అవస్థ పడాలీ అంటాడు"

"అవును నిజమే, ఎందుకీ అవస్థ." అన్నాను.

రిత్తపోయి దెబ్బతిన్నట్లు నా వంక ఒక్క క్షణంపాటు చూసేడతను. నేను వూరుకోలేక యింకా అన్నాను. "అవునోయి. యీ హోటలు భోజనం సౌఖ్యమా? భార్య ఎదిగి వున్నదికదా, పోయి పిల్చుకు తెచ్చుకోరాదూ? మామగారితో పేచీలేమైనా వున్నాయా పోనీ? ఏమిటి, విన్పించరాదూ అసలు కదేమిటో!"

"అట్టే పేచీలులేవు. ఏమిలేవు." నసిగేడు అతను తలవంచుకొని.

"మరింకేమిటి?"

"ఎందుకేమిటి? ఎప్పుడూ ఆలోచించలేదు తీవ్రంగా."

"దీనికి పెద్ద ఆలోచన దేనికి. మతేసున్నా వేమోయింకా?"

"అదేచూస్తున్నా" చెప్పేడతను.

"నీ తలకాయ. శుభ్రంగా చక్కటి యిల్లు చూసుకుని భార్యను పంపించమని వుత్తరంరాయి. కొంపకూడా నువ్వు వెతుక్కోవలసిన బాధలేదు, వెంకట్రావే తిప్పలు పడతాడు."

"వాడూ అదే అంటున్నాడు."

ఆ తర్వాత అతను నవ్వగా నేనెప్పుడూ చూడలేదిక. ఆ రోజుతోనే ప్రారంభం అతనిలో విషాదం ఎప్పుడూ చూచినా విచారంగా, ఏదో అమూల్య పదార్థాన్ని పోగొట్టుకున్నట్లు అగుపిస్తూండేవాడు. "ఏమిట్రా విషయం అంటే ఖంగారుపడి. 'ఏమిటి' అని తిరుగు ప్రశ్న వేసేవాడు. అడిగేవాళ్ళం తిరిగి, ఏమిటా ఆలోచనలని, ఏమీలేదు అనికూడా అనే వాడుకాదు. విచారంగా తలమాత్రం ఎగురవేసి వో నిట్టూర్పు మాత్రం విడిచేవాడు.

రోజూ క్రిష్టపట్టుకు వెళ్ళుతూనే వుండేవాళ్ళము. మాట్లాడుకుంటూనే వుండేవాళ్ళము. కాని కేశవుడు మాత్రం మౌనంగా, ఏదో ఆలోచనలతో నలిగిపోతూ వుండేవాడు. ఇక అతని విషాదానికి అంతులేదా అన్పించేది.

ఎన్నాళ్ళో యిట్లా! ఒకనాడు సాయంత్రం కాబోలు వెంకట్రావ్ అగుపించి చెప్పేడు 'మంచి డాబా యిల్లొకటి నలభయి రూపాయలకి దొరికిందిరా' అని.

"అట్లాగా" అన్నాను.

"ఏం, చవకకాదూ" అడిగేడు.

"ఒక్కడికీ నలభయిరూపాయల కొంప ఎందుకోయ్?"

"రెండు భాగాలున్నాయి. నేనూ కేశవుడూ వుంటాం. లోపల ఎలెక్ట్రిసిటీ, దొడ్లో పంపు, చెరి మూడేసి గదులు. ఎట్లావుంది?"

"బాపుందిగాని, వాడికి తెలుసా యీ సంగతి."

"నేను కుదుర్చుకొచ్చి వానితో చెప్పేను. సరే నన్నాడువాడు. ఏం?"

కేశవరావు వస్తూండడం చూచి సంభాషణ మార్చేము మేము. మత్తుగా వున్నాడతను. ఆదినం పేపర్లోపడ్డ పక ఆత్మహత్య విషయం మేం మాట్లాడుకుంటూండగా మాత్రం అతను కొంచెం వుత్సాహంగా మా ప్రసంగంలో మాటలు కలిపేడు.

రెండు దినాల తర్వాత అనుకుంటాను. కేశవరావు నాలుగు రోజులు ఆఫీస్‌కు సెలవుపెట్టి వాళ్ళవూరు భార్యను తెచ్చుకోడంకోసం వెడుతున్నానని చెప్పేడు సిగ్గుపడుతూ. ఆ రోజు మాసందులోని గదిని అతను ఖాళీ చేసినట్లుకూడా నేను తెల్సుకున్నాను.

సుమారు నెలరోజులు దాటివుంటుంది కేశవరావును చూచి. అనుకోకుండా కన్పించేడతను ఆదివారము బజార్లో. చాలా చిక్కిపోయి వున్నాడు. ముఖంమీద విచారరేఖలు దట్టంగా వ్యాపించి వున్నయ్. కళ్ళక్రింద నల్లటి చారికలు నిద్రా సౌఖ్యంలేని రాత్రులనుగూర్చి ఎలుగెత్తి చెబుతున్నయి.

నన్ను చూసి సంతోషంతో అతనే పిల్చేడు. వెళ్లేను. అతనిదగ్గరకు. ఆఫీసుపని ఎక్కువగా వుందనో, సంసారభారం నెత్తిమీద పడిందనో కారణాలు చెబుతాడనుకున్నాను. కాని ఏమీ అనలేదు అతను. ఒకసారి భుజాలు ఎగురవేసి, నా చేతిని ఆప్యాయంగా పట్టుకుని, కండ్లలోకి దీనంగా చూస్తూ అడిగేడు" చాలా దినాలయింది. ఒకసారి కృష్ణఒడ్డుకు వెళ్ళవద్దాం. రారూ?' అతని స్వరంలో దైన్యము; తలవూపేను.

నదివడ్డున, తెల్లటి ఇసుకలో కూర్చున్నాము యిద్దరమూ. ఎండు గడ్డి పరకముక్కను నోట్లో పెట్టుకుని మౌనంగా కూర్చున్నాడతను. ఎదురుంగా ఎర్రటి సూర్యుడు, కొండలవెనక్కి జారుకుంటున్నాడు. అద్భుతమైన అరుణ వర్ణమును ఆకాశం వోమూల పులుముకుంటూంది. ఏదోవకటి మాట్లాడాలికదా అని నేను 'Song to Remember' చూచేవా అని ప్రశ్నించేను. అతని ముఖం ఎరుపెక్కింది వుద్రేకంతో. సంబాళించుకుని చిన్న నిట్టూర్పు విడిచి అతనూ కొండపైపు చూస్తూ కూర్చున్నాడు. క్రమక్రమంగా ఆనందంతో వెల్లివిరుస్తూన్న అతని ముఖం చూస్తూ రాత్రి నేను చూచిన సినిమా కథను అతనికి చెప్పుతూన్నాను. ఉన్నట్లుండి అతను అడిగేడు "క్రొత్తగా Pass అయిన Hindu code Bill ప్రకారం కారణం చూపకుండా భార్యను భర్త వదిల్తే ఏమవుతుంది?"

అదిరిపోయేను అతని ప్రశ్నకు. వింతగా అతనివైపే చూస్తూ వుండిపోయేను.

అతనే అన్నాడు తిరిగి "భర్తకు రెండేళ్ళ శిక్షటగా?"

"కాబోల్ను, ఇప్పుడెందు కా ప్రసక్తి."

"అట్నే వూరికే అడిగేను, అయితే మరి మొగవానికి యిష్టంలేని వివాహమనుకోండి అది. పెద్దలు చేసిన తప్పుకి పిన్నలా శిక్ష అనుభవించేది?"

"భార్య అంగీకారం వుంటే Divorce తీసుకోవచ్చునుగా భర్త" అన్నాను.

"ఏం బిల్లండి అది. ఈ హిందూదేశంలో భర్త ఎంత చచ్చు పెద్దైనా, అతన్ని వదిలేభార్య జన్మించిందాండి అసలింతవరకు అదవా, జన్మించినా ఆమెను బ్రతకనిస్తుందా యీ సంఘం పుట్టినప్పటినుంచీ ఆమెకు యిదే నీతిబోధేకదా "భర్త గుడ్డైనా, కుంటైనా. ముష్టైనా అయిష్టుడైనా అతనేదైవం. అతన్ని వదిలేవా నీగతి గద్దలపాలె." అకస్మికంగాఆగిపోయేయి అతని మాటలు. ఎందుకో అతని కండ్లవెంబడి అశ్రువులు రాలుతున్నాయి. వెర్రివాడిలా ఆకాశంవైపు చేతినివూపుతూ, 'ఈ ప్రకృతిలో ఎంత ఆనందంవుంది' అన్నాడు

నేనేమీ గమనించనట్లు లేచి నిలబడి, 'యికపోదాం' అన్నాను. అతనూ యిష్టంలేనట్లులేచి, వెనక వెనక్కి చూస్తూ నడవసాగేడు. దారి చివరా నిశ్శబ్దంగా నడిచేము యిద్దరమూ. ఆ రాత్రల్లా నాకు వకటే ఆలోచన. అతని హృదయంలోకి నేను తొంగి చూడగల్గితే, అతని బాధను అనునయింపజేసి, అతనికి శాంతిని. ఆనందాన్ని చేకూర్చ గలిగితే!'

అకస్మికంగా వకనాడు వెంకట్రావు అవుపించేడు మాయిళ్ళవద్ద. వరండాలో పచారుచేస్తున్న నన్నుచూచిలోపలకొచ్చి కూర్చొని అన్నాడు,

"కేశవరావు ఏమో బసుకునేవాడిని మొదట్లో అంటే ఎల్లా తయారయ్యా
డండీ? ....ప్రపంచం"

"ఏం? ఏమయ్యిందది. కులాసాయేనా అతను" అడిగేడు.

"ఆఁ! కులాసాయే. నాతో మాట్లాడటము మానేసేడీమధ్య"

"అదేమిటి? అడంగుల ఏమన్నా పూటాముటా అనుకున్నారా?"

"అట్లాగయినా బావుండిపోయేది. అదేమీలేదు. చచ్చిచెడి వెతికి
వాడికి యిల్లు యిప్పించినందుకు."

"కొంచెం విపులంగా చెప్పండీ చందర్." అడిగేడు. ఆశ్చర్య
పోతూ అన్నాడతను. "చెప్పేదేనా ప్రపంచమే అంత అనీ. ఇల్లూ సంసా
రం లేదన్నాళ్ళు హాయిగా వున్నాడట అతను. పాడా యింట్లోకి సంసారం
తీసుకువచ్చి నప్పటినుంచీ హరించిపోతున్నాట్ట"

"ఎవడూ యీమాట అన్నది?"

"ఇంకెవ్వరూ? వాడి ఆఫీసులోని సహోద్యోగి అంతా అనేమాట.
అల్లా అంటే అర్థమేమిటి? ఆ సంసారానికి అంతా నేనే కారణ
మనేగా? అది విన్నాడో ఏమో నాతో మాట్లాడటమే మానివేసేడు."

"ఇంకేమైనా తగువులుగాని, పొరపొచ్చాలుగాని వున్నాయేమో ఆలో
చించు కాస్త." అన్నాను ఉక్కపోయి.

"ఉంటే నాకు తెలియదూ! మేమేమీ లేము. అసలు మనిషి చాలారకం
గానే మారిపోయేడు, Mental గానే కాబోలు. ప్రతీ చిన్న విషయానికీ
అమిత చిరాకు. కొంచెం మోహమే తగ్గింది. ఒకవేళ యింట్లో
వున్నా అప్పుడు తాన్సేవు పడక కుర్చీలో పడుకునే వున్నా చిరాకు
మొఖంతో ఏమేమో ఆలోచిస్తుంటాడు. ఎన్నో రోజులు ఏమో
రాత్రిళ్లు ఆ క్రిస్మస్ చెట్టు కింద గంటల కొలది వెన్నెల్లో
అలా కూర్చుండిపోతాడుట. ఏమో అన్నాడు కాని వెన్నెల్లో కూర్చుంటు
న్నాడో లేక అక్కడ సుమసెల్లో...." ఖూజాతె సరవేస లేచి నిలబడ్డాను

వెంకట్రావు. 'వెళ్ళొస్తా' నంటూ సమాధానం కోసం ఎదురు చూడ కుండానే బయటికి వెళ్ళిపోయేడతను.

కూర్చున్నవాణ్ణి కూర్చున్నట్లే వుండిపోయేను నేను. వెంట్రావ్ మాటలు, కేశవరావు ప్రవర్తన నన్ను కలవర పరిచేయి అమితంగా. ఇతను యిదివరకు నేనెరిగిన కేశవుడేనా? ఏమిటో అతని బాధ! ఆలో చనలు సుడులు తిరగసాగినాయి,

మర్నాడు ఆఫీసునుంచి తిన్నగా కేశవరావు యింటిని వెతు క్కుంటూ బయలుదేరేను వెదకి వెదకి చివరకు పట్టుకోగల్గేను. కాని కేశవుడు యింట్లోలేడు.

'ఎప్పుడు వస్తాడో చెప్పగలరా?' అడిగేను యింటామెను.

ఆమె వయస్సు పద్దెనిమిది వుండవచ్చు. లావుగా, దొందుగా వున్నదామె. ముఖం అందమయినది కాకపోగా చూడటానికి యింపయి నదికూడా అనలేము. ఈమెనా సౌందర్యోపాసి కేశవుడి భార్య!

మృదువుగా జవాబిచ్చిందామె "పది గంటలకల్లా రావచ్చు. ఎవరు వచ్చేరని చెప్పమంటారు?"

ఎంత మృదువైన స్వరం! లతామంగేశకర్ గానంలా వుంది ప్రతిమాటా.

"నారాయణ అని చెప్పండి." ముందుకు సాగేను వెనకాలే తలుపు చప్పుడుతో.

మర్నాటి వుదయాన్నే వెళ్ళేను తిరిగి అక్కడికి. ఆమె గుమ్మం లోనే నిలబడి వున్నది, ఆమే చెప్పింది సిగ్గుగా కొద్దిగా తలుపు ప్రక్కకు వత్తిగిలి. "ఇంకా తిరిగి రాలేదండి, ఎక్కడికి వెళ్లేరో?" ఆమెముఖంలో దైన్యరేఖలు చిక్కగా పులుముకొని వున్నాయి, నిద్రలేని కళ్లు.

వెంకట్రావ్ చెప్పిందంతా నిజమే కాబోలు నన్పించింది. ఏమ యినాసరే వీడి నివ్వేళ పట్టుకొని నాలుగు చివాట్లు వేయ నిశ్చయాని కొచ్చేను. సాయంత్రం మళ్ళీ బయలుదేరేను అక్కడికి.

నందుమొగలో వెంకట్రావు అవుపించేడు యింత ముఖంతో.

అతనే అడిగేడు నానుంచి ప్రశ్నరాకుండానే "ఇంకా మీకు తెలవలేదూ? వాడు ఎక్కడికో పారిపోయేడు. బహుశా దేన్నో లేవ తీసుకుపోయి వుంటాడు."

"ఛీ! ఛీ! ఉద్యోగం?"

"వాడికి ఉద్యోగమే కావలసివస్తే యిట్లా ఎందుకు చేస్తాడు. నేను పోలీసు స్టేషన్‌కుపోయి రిపోర్టు యిచ్చి వస్తాను. చూడు, ప్రబుద్ధుడు చొక్కా జేబులో ఏం వదిలిపోయాడో."

అదుర్దాగా చూచేను. ఉత్తరం అది, శారదకు రాసిన దతను.

జీవితమంటే ఎన్నో కలలు వుండేవి. ఈ సంసారంలో కరిగిపోతున్నాయా మహత్తర స్వప్నాలు, కలలేకాదు, జీవితమే, నేనే కరిగిపోతున్నా నీ సంసారంలో. పూర్తిగా చెయ్యి జారకముందే మేల్కొవడం వుత్తమంకదూ!

తిరిగిరాని నాకై నువ్వు కలలు కనడం ప్రారంభించకు. ఆనందం ఎక్కడుంటే అక్కడికి ఎగిరిపో.

"పోలీసు రిపోర్టిచ్చి లాభంఏమిటి" అన్నాను ఏమో ఆలోచిస్తూ.

ఉత్తరం లాక్కుని ముందుకి రెండడుగులువేసి 'చాలావుందిలే నీకేం తెల్సు. పాపం ఆ అమ్మాయి ఒకటే శోకం. మధ్యాహ్నం తల్లీ, తండ్రీ వచ్చేరు. పట్టుకోలేకుండా వున్నారామెను," వెళ్ళిపోయే డతను.

వెనక్కి తిరిగేను నేను. ఎన్నడూ అతనగుపించలేదు తర్వాత. అదృశ్యమయిన అతన్ని గురించి వినలేదు కూడాను నేనెన్నడూ!

# ఒక ప్రకటన

"ఏదీ ఒక నవ్వు నవ్వండి!" దినపత్రికలోని ఒక టూత్ పేస్టు ప్రకటన అడుగుతూంది.

నవ్వు! ఎన్నాళ్ళయ్యింది తను నవ్వి! బహుశా పదిహేను ఏళ్ళయి వుండొచ్చు. అవును-పదిహేనేళ్ళు.

తనకి పన్నెండో ఏడు అప్పుడు. బడిపంతులు అరటిపండు తొక్కమీద జారిపడబోయేడు. వెంకట్రావు కాబోలు అపబోయేడు - పంతులుగారిని. పంతులుగారు క్రోధంతో వెంకట్రావు వీపుమీదే బెత్తాన్ని ముక్కలు ముక్కలు చేసేసేడు. అంతా నవ్వేరప్పుడు. తనూ నవ్వేడు అందరితోబాటు. కండ్లవెంబడి నీళ్ళు తిరిగేయి తనకి ఆ నవ్వుతో.

అదే తను ఆఖరిసారి నవ్వగా గుర్తుండటం. ఆ తర్వాత తనకి యీ ప్రపంచంలో దేనిని చూచి నవ్వాలో తెలిసింది కాదు. కాంగ్రెసు వాళ్ళు లాఠీచార్జీలు తినడం చూచేడు, భార్యా పిల్లలను వదలుకొని జైళ్ళలో మ్రగ్గడం చూచేడు, అనారోగ్యంతో తన తండ్రి వైద్య సహాయానికి కూడా పైకం లేక బాధపడుతూ మరణించడం చూచేడు. రజాకార్లు ప్రజలను కాల్చుకుతినడం చూచేడు. బెంగాల్ కరువులో ప్రజలు ఆకులు ఏరుకు తినడం చూచేడు.

ఎవ్వరూ తన నీ దినాల్లో నవ్వమని అడగలేక పోయేరు. ఆఖరికి టూత్ పేస్టు కంపెనీవారు కూడాను.

"అత డెల్లప్పుడూ నవ్వుతూనే వుంటాడు".... అంటున్నది టూత్ పేస్టు ప్రకటన.

ప్రకటనలోని బొమ్మ ముఖం తన ముఖంలాగ లేదు. అచ్చంగా తన ఆఫీసరు ముఖంలా బుర్రంగా, నున్నగా వుంది. తన ఆఫీసరు ముఖంలాగే నవ్వుతూ వుంది.

తన ఆఫీసరుకు ఏడువందల రూపాయలు జీతం. కారులో వస్తా డాయన ఆఫీసుకు, బెడ్డలు లేని తెల్లటి మల్లెపువ్వుల్లాంటి బియ్యం బస్తా లతో ఇంటికి వస్తాయి ఆయనకు రేషనింగు రోజుల్లోకూడా. ఆయనకు జలుబుచేస్తే డి. యమ్. ఓ. యింటికి వచ్చి వారికి స్వయంగా మందిచ్చి వెడతాడు. ఆయన ఎల్లప్పుడూ నవ్వుతూనే వుంటాడు మరి.

"చక్కటి పలువరుసతో నవ్వే ఆ నవ్వు ఆరోగ్యం." మళ్ళీ ప్రకటనే!

తనది చక్కటి పలువరస. తనకి ఆరోగ్యం అంటే చాలా యిష్టం. పదిహేనేళ్ళ క్రితం నవ్వేడు తను. మళ్ళా నవ్వి ఆరోగ్యంగా వుందామని తన వుద్దేశం. కాని తనకి నవ్వు రావడంలేదు రెండవ యుద్ధం అయిపోగానే నవ్వుదామన్పించింది తనకి. యుద్ధంలో భర్తలను, తండ్రులను, పోగొట్టుకున్న అమాయక ప్రజలు గుర్తుకొచ్చేరు తనకి, వాళ్ళ శోకాలు తన చెవుల్లో గింగురుమన్నాయి. నవ్వలేకపోయాడు తను.

భారతదేశం స్వతంత్రదేశం అవ్వబోతూందన్నారు. పెదాలు విడి వడ్డాయి. ఆనందంతో, ప్రపంచం ప్రతిధ్వనించేంత బిగ్గరగా నవ్వాలని తన వుద్దేశం. భారతమాత రెండు ముక్కలుగా ఖండింప బడింది. హిందువులు ముస్లిములను, ముస్లింలు హిందువులను నరుక్కోసాగారు. రక్తం వరదలుగా పారసాగింది. తన పెదాలు విషాదకరంగా వంకరలు తిరిగి ముడుచుకు పోయేయి.

ప్రజాప్రభుత్వ మన్నారు. తినడానికి తిండి, వుండటానికి కొంప వుంటుందనుకున్నాడు తను. కడుపునిండా తిని, తీరికయినప్పుడు చల్లని

వంచను కూర్చుని కడుపు పగిలేటట్లు తామంతా నవ్వటమే తరవాయి అనుకున్నాడు తను. వచ్చింది తమ ప్రభుత్వం. చెరువుగట్టున పాకలో వుండే రౌడీ సుబ్బయ్య తమని పరిపాలించే వాళ్ళ జాబితాలో కెక్కాడు. చిరునవ్వు నవ్వసాగేడు. తను యిదివరకు లాగె, జీతం అంటూ, ఆరోగ్యం అంటూ ముక్కుతూ మూలుగుతోనే వున్నాడు.

"నిర్మలమైన, స్వచ్ఛమైన ఆచిరునవ్వు యిప్పుడే మీ దవుతుంది."

మాటలు. ఒట్టిమాటలు. నిర్మలమైనవి, స్వచ్ఛమైనవి ఏవీ తమవి కావు. చిరునవ్వు మాత్రం తమదెలా అవుతుంది? స్వచ్ఛమైనదేదన్నా తమకు మిగిలివుంటే అది వక్క మనస్సు మాత్రమే. అదికూడా మిగిలి వుండకపోతే ఎప్పుడో తను నవ్వగలిగి వుండేవాడు. సత్యం కోసం, న్యాయం కోసం హృదయాన్ని యింత వ్యధ ఎందుకు పెట్టాలి!

నిర్మలమూ, స్వచ్ఛమూను! ఏం మాటలు? ఆ మాటలకు అసలు అర్థమే పోయింది తనకు. తాము వాడే నెయ్యి స్వచ్ఛమైనది కాదు. తాము తినే తిండిగింజలు నికార్సయినవి కావు. తమ పిల్లలు త్రాగే పాలూ, మజ్జిగ స్వచ్ఛమైనవి కావు. తాము పీల్చే గాలి స్వచ్ఛమూ, నిర్మలమా?

ఇండ్లవద్ద ఫ్యాక్టరీ లుండకూడదట. అది చట్టం. తమ యింటి ప్రక్కనే ఒక....ఫ్యాక్టరీ. రాత్రిళ్ళల్లా భుక్, భుక్ భుక్, భుక్ అని వకటేమోత. తెల్లారి లేచేసరికి తమ కొంపనిండా ఫ్యాక్టరీ చెత్త. గాలికి ఆ నలుసులు ఎప్పుడూ ఎగురుతూనే వుంటాయి. కండ్లకి కనపడని ఆ నలుసుల్ని తా మెప్పుడూ లోపలకు పీలుస్తూనే వుంటారు. తమ ఆరోగ్యం సరిగా వుండదు. తా మెపుడూ చిరునవ్వు నవ్వరు.

పదాలకు విలువే పోయింది అసలు. 'స్వచ్ఛమూ,' 'నిర్మలమూ' అనే రెండు పదాలకే కాదు, చాలా పదాలకు. 'దయ' 'సత్యం' 'నీతి' 'విచక్షణ' 'వివేకం' 'న్యాయం' మొదలయిన పదాలు అసలు మరుగున పడిపోయేయి. ఎలెక్షన్ల ముందు ప్రచారానికి రాజకీయవేత్తలు వుపయో

గించే ఆయుధాలవ్వీ ప్రస్తుతం. ఎలెక్షనులు అయిపోగానే పదాలు వారి స్వంత ఆస్తులలా భద్రంగా దాచబడతాయి. ఎట్లా నవ్వొస్తుంది తనకు? ఎట్లా తనదవుతుంది ఆ నవ్వు:

"ఎట్లాగంటారా? నేడే ఏ అంగడిలో నయినా అడగండి...."

చాలా వోపిక యీ విదేశ వ్యాపారస్తులకు. తమవంటి మూఢులకు, అపారమైన విజ్ఞానంతో చిరునవ్వును కొనుక్కోవడం నేర్పుతారు. తమ కడుపులు కాలుతున్నాయి. తమ దేశాన్ని చీడపురుగులు పీల్చి పిప్పి చేస్తున్నాయి. మీకేమైనా తెలిస్తే మా దేశాన్నుంచి చీడపురుగుల్ని ఏరి వెయ్యటం చెప్పండి. మా కడుపుల మంట చల్లారే మార్గాలు చెప్పండి. మా దేశం సారవంతం చేసుకుంటాం" అంటే పక-టూత్ పేస్టు చిరునవ్వును వదుల్తారు. 'మీ దేశ సంపద మాకు కావాలి' అనరు. "ఆనందమే ఆరోగ్యం" అనందానికి చిహ్నం యీ చిరునవ్వు. ఏదీ, కొనండి, నవ్వండి" అంటారు.

ఎట్లా కొనేది ఆ టూత్ పేస్టు? ఎట్లా నవ్వేది ఆ నవ్వు: తన జీతం 72 రూపాయలు. తన తల్లికి ముప్పదిరెండు పళ్ళు. తన భార్య చీరలు కట్టుకుంటుంది. తన తమ్ముడు బళ్ళో జీతం కడుతున్నాడు. తనా? తను: నవ్వుదామన్పిస్తోంది గాని శక్తిలేకుండా వుంది

"పదిహేను అణాలు మాత్రమే చిన్న ట్యూబు" చేతిలోనుంచి జారిపోయిన పత్రికలోని ప్రకటన క్రిందపడికూడా అడుస్తోంది.

పదిహేను అణాలు మాత్రమే! ఆ 'మాత్రమే' అనే పదమే చాలా గొప్పగావుంది. రెండేళ్ళనుంచి 'మాత్రమే' తను చెప్పులు కూడా లేకుండా నడవటం అలవాటు చేసుకున్నాడు. హిరోషిమా నాగసాకిల మీద 'మాత్రమే' ఆటంబాంబులు కురిపించ బడ్డాయి! కొరియాలో

యుద్ధం 12 నెలల నుంచి 'మాత్రమే' జరుగుతోంది. ఆంధ్ర ప్రజలకు తిండిగింజల కరువు అయిదేళ్ళ నుండి 'మాత్రమే'. భారతదేశంలో జీవన్మృతులు క్రొత్త లెఖ్ఖల ప్రకారం 37 కోట్లు 'మాత్రమే'.

నవ్వగల్గినవారు యిక నవ్వవచ్చు।

# ఉత్తమ నవలా సాహిత్యం

మాగవాడు

◆

ముగ్ధప్రణయం

◆

తొలివలపు

◆

భగ్నహృదయం